# అమాత్య

డా॥ ముటువ్వారి సంగమేశం



ప్రచురణ






రిజిస్ట్రేషన్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

**ANNAMAYYA**
A brief introduction about Tallapaka Anuamacharyulu
and his poitic works with Commentary
by Dr. M. Sangamesam
C YUVABHARATHI, Secunderabad-500 003.

యు వ భా ర తి
ప్రచురణ : 94
ప్రథమ ముద్రణ : ప్రతులు 2,200
9 డిశంబరు 1983

ముఖచిత్ర రచన : శీలా వీర్రాజు

ముద్రణ :
విజయ్ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాదు-500 020

ముఖచిత్ర ముద్రణ :
బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్,
చిక్కడపల్లి, హైదరాబాదు-500 020

ప్రతులకు :
యువభారతి, 5 కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003
లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు,
తిలక్‌రోడ్, హైదరాబాద్-500 001

వెల : రూ. 3-00




# యువభారతి పరిచయం

ఉత్తమ అధ్యయనంవల్ల వ్యక్తిత్వానికి సమగ్రత చేకూరుతుంది. సమాజంలో సామరస్యం పెంపొందుతుంది. ఉత్తమ భావ ప్రసరణానికి పుస్తకాలు చక్కని సాధనాలు. అందరికీ అందుబాటులో ఉండే విధంగా మంచి పుస్తకాలను అందించే ప్రయత్నానికి యువభారతి పూనుకొని గడచిన ఇరువయ్యేళ్లుగా పాతకొత్తల మేలు కలయికను ప్రాతిపదికగా పెట్టుకొని నూరు పుస్తకాలను ప్రచురించింది. ఉపన్యాసమంజరీ కార్యక్రమాలను, సదస్సులను నిర్వహించింది.

సహృదయుల సహకారంతో పుస్తకాల అమ్మకంవల్ల వస్తున్న ద్రవ్యంతో పుస్తకాలను ప్రచురిస్తున్న తక్కువ వెలకు ఎక్కువ విలువున్న సాహిత్యాన్ని అందించడానికి యువభారతి ఉద్యమిస్తున్నది. ఉత్తమ సాహిత్య ప్రచారాన్ని ధ్యేయంగా పెట్టుకొని, ప్రచురణలను వెలువరిస్తున్నదేకాని మా సంస్థ వ్యాపార సంస్థ కాదు.

భారతదేశంలో ఎక్కడున్నసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంతో పాలుపంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో 8,500 మంది సహృదయులుచేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా 975 మంది, భారతీ భూషణులుగా 125 మంది చేరారు.

యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో సహృదయులు పరిచయం చేసుకోవాలని ఆశిస్తున్నాము. మాకు లేఖ వ్రాసి మా సంస్థ కార్యకలాపాల వివరాలను తెల్సుకొని మాతో సహకరించి సాహిత్యాభ్యున్నతికి, దేశాభ్యున్నతికి మేము చేస్తున్న ఉడుతాభక్తి సేవను ప్రోత్సహిస్తారని ఆకాంక్షిస్తున్నాము.

సహృదయుల సహకారమే సాహితీ వికాసం

హైదరాబాదు
9-12-1983

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు : యువభారతి




# మామాట

తెలుగు భాషలో పద్యానికంటే ముందు పదమే ఉండేది. పామరులు పదాల్లో తమ అనుభూతులకు కవితాకృతులను కల్పించుకొని ఆడిపాడి పరవశులైనారు. పండితులు సంస్కృతాన్ని ఆశ్రయించినారు, ఆదరించినారు. ఆదికవి నన్నయ్య పదాల స్వభావాన్ని, సంస్కృత ఛందస్సుల మర్యాదలనూ, కన్నడ కవితా మార్గాలను బాగా అవగతం చేసుకొని మార్గదేశి పద్ధతుల ఛందస్సులతో మహాభారతాన్ని రచించినాడు. అయితే ప్రజాసామాన్యంలో పదాలుగా పాటలుగా ఉండిపోయిన కవితా ఫణితులు, నన్నయ్య చూపిన మార్గంతో సమానాంతరంగా సాగిపోయినవి. జనవ్యవహారంలో ఎన్నో పలుకుబళ్ళు. మాండలికాలు సామెతలు. ఛందస్సులు, వాడుకభాష, పామరుల సొత్తు అయినవి. పదిహేనవ శతాబ్దిలో అన్నమయ్య అవతరించి ప్రజాసామాన్యంలో ప్రచారంలో ఉన్న పదాలను ఆదరించి, భక్తితో, సంగీతంతో, సాహిత్యంతో వాటిని పునీతంచేసి వేల తెలుగు పలుకుబళ్ళను వాటిలో చొప్పించి మహోదాత్త భావవాహికలనుగా తీర్చిదిద్ది "పదకవితా పితామహుడై"నాడు అన్నమయ్య పండిత పామరులకు కవి, స్త్రీలకు కవి, పిల్లలకు కవి, అమాయకులకు కవి, ప్రాజ్ఞులకు కవి, వేల పదాలను తిరుమలేశుని పాదాలకు అర్పించిన కవి.

అన్నమయ్య జీవితాన్నీ, ఆయన రచనా విశేషాలను క్లుప్తంగా, సరళంగా తెలుగు పాఠకలోకానికి అందించాలనే మా ఆకాంక్షకు రూపకల్పన చేసినారు సహృదయులు డా॥ ముట్నూరి సంగమేశంగారు. తెలుగు, హిందీ, సంస్కృత భాషలలో చక్కని అభినివేశం ఉన్న విద్వాంసులు ఆయన. మాకీ పుస్తకాన్ని వ్రాసిఇచ్చి ప్రచురించుకునే అవకాశాన్ని కల్పించిన డా॥ ముట్నూరి సంగమేశం గారి సాహిత్యప్రణయానికీ, ఔదార్యానికీ మా నమోవాకములు.

కృతజ్ఞతాభివందనము.

ఇరివెంటి కృష్ణమూర్తి

అధ్యక్షుడు

యు వ భా ర తి.

# మధురాభివ్యక్తి

"పాఠ్యే గేయేచ మధురమ్" అని రామాయణాన్నివర్ణించాడు వాల్మీకి మహర్షి. పఠించటానికీ, పాడుకోవటానికీ మధురంగాఉండేది రామాయణ మన్నమాట. ఏ సాహిత్యంలోనైనా వెలసిన ప్రతికావ్యానికీ ఈ లక్షణాలు రెండూ అమరియుండడం అరుదు. అన్నమాచార్య సంకీర్తనలకాలక్షణం చక్కగా అమరిఉన్నది.

ప్రబంధకవిత వేరు, పదకవిత వేరు. పదకవిత పాడుకుంటే, లేక పాడుతుంటే పరమ రమణీయంగా ఉంటుంది. తెలుగులో వాగ్గేయకారులు సృష్టించిన సాహిత్యాన్ని పదకవితలని పిలుస్తాం. వారిలో త్యాగయ్య నాద బ్రహ్మ, ఆయన రచించినవి కృతులు. అన్నమయ్య మధురస బ్రహ్మ, ఆయన రచనలు పదాలు. రామదాసు భావబ్రహ్మ, ఆయన రచనలు కీర్తనలు. పదకవితల్లో వీరు సృష్టించిన రచనలు ఒక్కొక్క విశిష్టమైన ప్రక్రియకు ప్రాణం పోశాయి.

పద కవులలో తాళ్లపాక కవులది విశిష్టస్థానం. వారిలో అన్నమాచార్యులు ఆదికవి. సంగీత సాహిత్యాల్లో సంస్కృతాంధ్రాల్లో సవ్యసాచి. శ్రీ వేంకటేశ్వరస్వామి యందలి అనన్య భక్తిపారవశ్యాలతో కవితలల్లిన పరమ భక్తాగ్రగణ్యుడు. ఆయనకు హరికీర్తనాచార్యుండనీ, పదకవితా పితామహుడనీ పంచమాగమ సార్వభౌముడనీ ప్రసిద్ధి ఉంది. వైష్ణవభక్తిమార్గంలో తాను సాధించిన ప్రపత్తి ప్రస్థానంలోని ప్రతి అడుగునూ, అనుభూతినీ తెలుగులో రచనగా వెలార్చిన మధురకవి. తెలుగులోని తియ్యందనాన్ని భక్తిరసామృతంపై తెట్టలు కట్టించిన వాగ్విలాసి. ద్రావిడవేదాలను తెలుగు కుల్యలలో నింపిన రసమూర్తి. రామాయణాన్ని ద్విపదలో ఆలపించిన ప్రౌఢకవి. భక్తిరాగ భావ ప్రపంచనాన్ని శతక ప్రక్రియలో పొంగించిన ఆశుకవి. అతని శృంగారమంజరి భక్తిలో ప్రభవిల్లిన రక్తికిమౌక్తికం లాంటిది. సంకీర్తనలక్షణగ్రంథం తాను వెలయించిన ప్రక్రియకు ప్రమాణాలను నిర్దేశించే సూత్రగ్రంథం. ఇవన్నీ ఒక యెత్తు; మధురభక్తికి మణితోరణంగా నిలిచే సంకీర్తనలు మరో యెత్తు. శృంగారాధ్యాత్మిక ప్రవృత్తులతో ప్రకాశించే సంకీర్తనలు ముప్పై రెండు వేలకు పైబడి ఉన్నాయి. తాళ్లపాకవారి సాహిత్యంపై పరిశోధన చేసిన

డా॥ వేటూరి ఆనందమూర్తి అన్నమాచార్యుల సంకీర్తనలను - "వైష్ణవ తత్త్వము ముల్లెగట్టిన ముత్యాల మూటలు"గా అభివర్ణించారు. ఆనందమూర్తి గారి పితృపాదులు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అన్నమాచార్య సంకీర్తనలు వ్రాయబడి ఉన్న రాగిరేకుల భండాగారాన్ని వెలికితీసి వెలుగునింపినవారు, తాళ్లపాకవారు పదకర్తలు; వేటూరివారు పరిశోధకులు, తాళ్లపాకవారిని చదవందే తెలుగురాదని ప్రభాకరశాస్త్రిగారన్నారట. "ఆమాట అక్షరాల నిజ"మని ఆంధ్ర సహృదయ లోకపక్షాన ఆరుద్రగారు అంగీకరించి అనుశీలించారు. "మోక్ష సాధనకు భక్తి ప్రపత్తులే రాజమార్గమని వైష్ణవమతం నమ్ముతుంది. అయితే భక్తిలో వివిధ రసాలున్నాయి. శాంత, దాస్య, సఖ్య, వాత్సల్య, మధుర భావా లనే పంచవిధ భక్తిరూపాలున్నాయి. అన్నమాచార్యులవారు ఈ అయిదు రూపాల భక్తితో తాను నమ్మిన దైవాన్ని ఆరాధించారు. ఒక్కొక్క భక్తి మార్గంలో కొన్నివేల గేయాలు రచించారు.... భగవంతుని ప్రాణనాధునిగా యెంచుకొనే మహాభావమే మధురభక్తి అంటారు. అదే ఆధునిక భారతీయ సాహిత్యంలో వైష్ణవ కవిత అనే పేరుతో చెలామణి అవుతున్నది. ఈ భక్తి మార్గంలో అన్నమయ్య రచించిన సంకీర్తనలు వేలాదివేలు, ఆయన తన జీవితంలో ముప్పయిరెండువేల సంకీర్తనలు వ్రాశారట, అందులో సగానికి ఎక్కువగానే శృంగార కీర్తనలు ఉంటాయని భావించడంలో తప్పులేదు. తనే నాయికగా, అలమేలు మంగగా చెప్పినవెన్నో ఉన్నాయి. దూతికగా దివ్య ప్రేయసీ ప్రియులకు రాయబారాలు, రాజీలు, రహస్యాలు చెప్పడాలు మొదలైన వెన్నో ఉన్నాయి. శృంగార లక్షణ గ్రంథాలలోని లక్షణాలకు వ్యతిరేకంతావివి, ఆ సూత్రాలకు లొంగనివి వేలకువేలు ఆయన రచించారు. అని సమగ్రాంధ్ర సాహిత్యంలో ఆరుద్ర వివరించారు.

నవవిధ భక్తిసంప్రదాయం మహాభాగవతంలో కనపడుతుంది. పంచ విధ భక్తిసంప్రదాయం వైష్ణవభక్తిసంప్రదాయానికి సంబంధించింది. ఆ సంప్రదాయాన్ననుసరించి ఆ విభాగాన్ని శ్రీ రూపగోస్వామి తాను రచించిన భక్తిరసామృత సింధువులో వివరించాడు.

"ముఖ్యస్తు పంచధా శాన్తః ప్రీతిః ప్రేయాంశ్చ వత్సలః
మధురశ్చేత్యమీ జ్ఞేయా యథాపూర్వ మనుత్తమాః
హాస్యోద్భుత స్తథావీరః కరుణోరౌద్ర ఇత్యపి
భయానకః స బీభత్స ఇతి గౌణశ్చ సప్తధా "

అని శ్రీరూపగోస్వామి వివేచనం. ఆయన భక్తిని ముఖ్యగౌణ భేదాలుగా పరిగణించాడు. ముఖ్యభక్తినిఅయిదు విధాలని చెప్పాడు. అవి : శాంతభక్తి, ప్రీతిభక్తి, ప్రేమోభక్తి, వత్సలభక్తి, మధురభక్తి. ఇవి క్రమంగా ఉత్తరోత్తరాలు శ్రేష్ఠాలని పేర్కొన్నాడు. అంటే మధురభక్తి అన్నింటికంటె ఉత్తమమైనదని ఆయన ప్రతిపాదనం. ఆ మధురభక్తిని విశేషించి "ఉజ్జ్వల నీలమణి"లో వివరించాడు. ఇక హాస్యాది సప్తవిధ రసాలతో మిళితమైఉన్న భక్తి గౌణరసంగా పేర్కొన్నాడు. వాటిని హాస్యభక్తి, అద్భుతభక్తి, వీరభక్తి, కరుణభక్తి, రౌద్రభక్తి, భయానకభక్తి, బీభత్సభక్తి అని వివరించాడు. ఇవి ఏడు, నవవిధ రసాల్లో శృంగారం, శాంతం గౌణభక్తులలో చేరవు. మధురభక్తిలో శృంగారం' శాంతభక్తిలో శాంతం ఉంటాయి; అవి రెండూ ముఖ్య భక్తులౌతాయి. అంటే అన్నమాచార్యులు రచించిన అధ్యాత్మసంకీర్తనలు శాంతభక్తికి, శృంగార సంకీర్తనలు మధురభక్తికి ప్రాతినిధ్యం వహిస్తాయనీ, వైష్ణవభక్తిసంప్రదాయంలో ఆ రెండింటిలో మధురభక్తి సంకీర్తనలే మిన్నలని భావింపబడుతూ ఉంటాయనీ స్పష్టమౌతోంది.

శ్రీ రూపగోస్వామి ప్రపచించిన భక్తిరస స్వరూపాన్ని గూర్చి శ్రీవిష్ణుపాద శ్రీ లసచ్చిదానందభక్తి వినోదఠాకూరు రచించిన జైనధర్మమనే గ్రంథంలో వివరించారు. (ఆంధ్రానువాదం : శ్రీ జన్నాభట్ల వాసుదేవశాస్త్రి) శ్రీ రూపగోస్వామి జగత్తు రెండువిధాలన్నాడు. జడజగత్తు, చిజ్జగత్తు అని. చిజ్జగత్తు జడజగత్తులో అద్దంలోని ప్రతిబింబంలాగా ప్రతిఫలిస్తుంది. బింబం ప్రతిబింబించినప్పుడు అపసవ్యంగా కనపడుతుంది. అలాగే జడజగత్తులో శాంతభక్తి ఉత్తమంగా, మధురభక్తి అధమంగా గోచరిస్తుంది. అయితే అది చిజ్జగత్తులోని వాస్తవానికి వ్యత్యస్తరూపం, భక్తిరసం చిజ్జగత్తుకు సంబంధించింది. అందులో మధురరసం ఉత్తమం శాంతం అధమం. కాబట్టి భక్తిరస భేదాల్లో కూడా మధురభక్తి ఉత్తమమని శ్రీ రూపగోస్వామి భావించాడు. దాని వివరణం జైనధర్మ గ్రంథంలో ఇలా ఉన్నది- "చిజ్జగత్తులో శాంతధర్మగత శాంతరస మన్నింటికంటె క్రిందనుండును. దానిపై వాత్సల్య రసము, అన్నింటికంటెపైన మధురరసము విరాజిల్లును. జడజగత్తున మధురరసము విపర్యస్తమై యన్నింటికంటె క్రిందనుండును. దానిపై వాత్సల్యరసము, దానిపై సఖ్యరసము, దానిపై దాస్యరసము, అన్నింటికంటెపైన శాంతరసము విరాజిల్లుచున్నది. జడధర్మస్వభావము నవలంబనముజేసికొని రసతత్త్వమును

గూర్చి చర్చించువారిట్టి సిద్ధాంతములనే చేసి మధుర రసమును హీనమైనదిగా తలంతురు. మధుర రసస్థితి, క్రియలు జడజగత్తున ప్రతిఫలితము లగునప్పుడు ఆ ప్రతిఫలిత స్థితి, క్రియ మిగుల హీనములు, లజ్జాస్పదములు నగును. చిజ్జగత్తులోనవి పూర్తిగ శుద్ధము, నిర్మలము, అద్భుతరూపముగ మాధుర్యపూర్ణము నగును.... చిజ్జగత్తులో కృష్ణుడే ఏకైక పురుషుడు, చిత్తత్త్వ సమూహ మీరసములో ప్రకృతి. అందువలననేదియు ధర్మవిరోధముకాదు. జడమున నొక జీవుడు భోక్తయగును; మఱియొక జీవుడు భోగ్యమగును. పరస్పర మనుభవింప దలంతురు. ఈ వ్యాపారము మూలతత్త్వమునకు విరోధమగుట వలన ఘృణాలజ్జలకు విషయమైనవి. తాత్త్వికముగ నొక జీవుడు మఱియొక జీవునకు భోక్తగాడు, జీవులందరు భోగ్యులే, శ్రీ కృష్ణుడొక్కడే భోక్త. ఇట్టి స్థితిలో జీవుని భోక్తగ జేయుట నిత్యధర్మమునకు విరుద్ధమగు వ్యాపారము. ఇది నిజముగ హీనమగు విషయము. దీనిలో నెట్టి సందేహమునులేదు. చూడుము — ఆదర్శ ప్రతిఫలన చర్చచే జడస్త్రీ పురుషుల వ్యవహారము, నిర్మలములగు కృష్ణ లీలలు రెండింటిలోను సాదృశ్యము తప్పకయున్నది. అయినను ఒకటి మిగుల హీనము, మఱియొకటి మిక్కిలి ఉపాదేయము."

భక్తిరసతత్త్వాన్నీ, అందులోనూ మధురభక్తి తత్త్వాన్నీ తెలిసికోవాలంటే శ్రీ రూపగోస్వామి సమన్వయాన్ని మనం అవగాహన చేసికోవాలి. భాగవతంలోని గోపికాశ్రీకృష్ణ తత్త్వాన్నిగాని, వైష్ణవ భక్తిలోని రాధామాధవతత్త్వాన్నిగాని ఈ సూత్రంతోనే అన్వయించుకోవలసి వస్తుంది. అయితే, పంచవిధ భక్తిప్రస్థానం శ్రీ కృష్ణ పరబ్రహ్మం చుట్టూ తిరిగింది. శ్రీ కృష్ణ పరమైన భక్తియే పరిపూర్ణరసం అవుతుందని వైష్ణవ భక్తిమార్గం భావిస్తుంది. మధురసం మధురాకృతిలో ప్రత్యక్షమైతే శ్రీ కృష్ణుడని, వైష్ణవభక్తి తత్వజ్ఞులు భావిస్తారు. అన్నమాచార్యులకు శ్రీ వేంకటేశ్వరస్వామియే పరతత్త్వం: సగుణబ్రహ్మం. ఆయనలోనే అన్ని రూపాలను దర్శించాడాయన. అలమేలుమంగలోనే సర్వ గోపికా తత్త్వాన్నీ, రాధామూర్తినీ దర్శించాడు. చివరకు తానే అలమేలుమంగగా మారి కీర్తనలు వ్రాశాడు. శ్రీకృష్ణపరమైన భక్తితత్త్వాన్ని శ్రీ వేంకటేశ్వర స్వామి పరంచేసిన భక్తాగ్రగణ్యుడు, భాగవతోత్తముడు అన్నమాచార్యులు. క్షేత్రయ్య ఈ భక్తితత్త్వాన్నే మువ్వగోపాల పరంచేశాడు. ఈ విధంగా తెలుగులో పంచవిధ భక్తితత్త్వానికి ప్రమాణంగా నిలిచిన పదసాహిత్యం సృష్టించిన గౌరవం, ఆ సంప్రదాయానికి మార్గంచూపిన మహిమ, "పద కవితా పితామహు"డైన తాళ్లపాక అన్నమాచార్యులకు దక్కింది.

అన్నమాచార్య సంకీర్తనలను గురించి సరసము, సరళము అయిన సమీక్షను డా॥ ముట్నూరి సంగమేశంగారు యువభారతి ప్రచురణగా అందించటం అభినందనీయం, ఇందులో అన్నమయ్య సంకీర్తనలను చక్కగా విశ్లేషించి, వాటిని సమన్వయ సుందరంగా ప్రపంచించారు రచయిత. అవతారికలో అన్నమయ్యను, అతని సాహిత్యాన్ని పరిచయం చేసి, "కావ్యసౌందర్యము - వస్తు వైభవము" అనే ప్రకరణంలో అధ్యాత్మ, శృంగార కీర్తనలను గురించి సమీక్షించడమే కాకుండా వాత్సల్యాదులను కూడ వివరించి చూపించారు. అందులోనే నాయికా నాయకులైన అలమేల్మంగగా వేంకటేశ్వరులను, గోపికలను, దూతికలను, చెలులను, దౌత్యాదులను, సంయోగ విప్రలంభాదులను వివేచించి నిరూపించారు. మూడవ ప్రకరణంలో కావ్యసౌందర్యాన్ని, శిల్పసంపదనూ అనుశీలిస్తూ, అలంకార నిర్వహణాన్ని, భాషా విశేషాలనూ, పదకవితా స్వరూపాన్ని సమీక్షించారు. పదకవితా పితామహుని సాహితీమూర్తికి ముకురంలాగా ఉన్న ఈ రచన ముచ్చటలు మూటకట్టుతున్నది.

వేదాంతాన్ని వ్రాసినా, విరహాన్ని చిత్రించినా అన్నమాచార్యుల బాణీ అత్యంత మధురంగా ఉంటుంది. సకల జీవుల్లో వ్యాపించియున్న పరమాత్మ చైతన్యాన్ని నిరూపించే ఈ గేయం తెలుగునాట రసికలోకం రక్తితో పాడుకోవటం వింటాం.

"తందనాన అహి తందనాన పురె  
తందనాన భళా తందనాన  
బ్రహ్మ మొకటె పరబ్రహ్మ మొకటె పర  
బ్రహ్మ మొకటె పరబ్రహ్మ మొకటె.

కందువగు హీనాధికము లిందులేవు  
అందరికి శ్రీహరే అంతరాత్మ  
ఇందులో జంతుకుల మంతా నొకటే  
అందరికి శ్రీహరే అంతరాత్మ.

నిండార రాజు నిద్రించు నిద్రయు నొకటే  
అండనే బంటునిద్ర అదియు నొకటే  
మెండైన బ్రాహ్మణుడు మెట్టుభూమి యొకటే  
చండాలు డుండేటి సరిభూమి యొకటే.

కడగి యేనుగుమీద కాయు నెందొకటే
పుడమి శునకము మీద పొలయు నెందొకటే
కడుపుణ్యులను పాపకర్ములను సరిగాన
జడియు శ్రీ వేంకటేశ్వరనామ మొకటే."

దృష్టాంతాల్లో దేశీయత, అభివ్యక్తిలో ఆధ్యాత్మికత అన్నమాచార్యుల కవితకు వెన్నతో వచ్చిన విద్దె. ఇలా అధ్యాత్మిక సంకీర్తనలను భక్తి పారవశ్యంతో ఆలపించే అన్నమయ్య మానవాకృతిదాల్చిన తుంబురుడో, నారదుడో, లేక గంధర్వుడో కాని సామాన్యుడు కాడని ప్రజలు భావించినట్లు తాళ్లపాక చిన్నన్న అన్నమాచార్య చరిత్రలో (ద్విపద) కీర్తించిన అంశం అతిశయోక్తి కాదని పిస్తుంది. చూడండి. –

"సకల వేదాంత-పఠనంబు జేసి యభంగ విస్ఫూర్తి
హరిపూజ హరిసేవ హరికీర్తనంబు
హరి మననము ధ్యాన మనిశంబు దనకు
ఘనతర సకల భోగంబులు గాగ
మనుచు వాల్మీకి రామాయణ మెల్ల
రాగంబుతో ననురాగంబుతోడ
బాగుగా గంధర్వులు బాగుగా జదివి
పాట లన్నియు తన పాట పిమ్మటన
పాట పాటనె పాట పాడి చూపగను
విన్నవారెల్ల సువ్విళ్లూరి యొక్క-
ప్రన్నవీసులు వింతు పండువుల్ సేయ
తుంబురుడో నారదుడో కాక యీ వి
ధంబున తిరుగు గంధర్వుడో కాక
మనుజుడో యీ యన్నమయ యని సర్వ
జనులును గొనియాడి సంతసింపగను."

పరమార్థాన్ని పాటగా వినిపించిన పదకవితాకర్త అన్నమయ్య. వేంకటేశ్వర స్వామి అంటే అన్నమయ్యకు ఆరాధ్యదైవం; అంతరాత్మ; పరమాత్మ. ఆ అంశాన్ని బహుపురాణార్థ దృష్టాంతాలతో సమర్థిస్తాడు. అదీ సంకీర్తన ముఖంగానే.

"శ్రీ వెంకటేశుండు శ్రీపతియు నితడె
పావనపు వైకుంఠపతియు నితడె
భాగవతములోఁ జెప్పె బలరాము తీర్థయాత్ర
నాగమోక్తమైన దైవతమూతం డితఁడె
బాగుగా బ్రహ్మాండ పురాణపద్ధతి యాతఁడితఁడె
యోగమై వామన పురాణోక్త దైవ మితఁడె.
వెలయు సప్తఋషులు వెదకి ప్రదక్షిణము
లలరఁ జేసిన దేవుఁ డాతఁ డితఁడె
నెలవై కోనేటిపొంత నిత్యముఁ గుమారస్వామి
కలిమిఁ దపము సేసి కన్నదేవుఁ డితడె."

భక్తి కవితలో మాధుర్యం అంతర్వేదనవలన కలుగుతుంది. విరక్తి నాశ్రయించి భగవంతుణ్ణి చేరాలని మనసు ఆరాటపడినప్పుడు ఆధ్యాత్మిక సంకీర్తన జాలు వారుతుంది. రతినాశ్రయించి శ్రీ వేంకటేశ్వరస్వామిలో లీనం కావాలనుకున్న ప్పుడు శృంగార కీర్తనం లాస్యం చేస్తుంది. భక్తిస్థాయైనరతి శృంగారంలోవి రతికాదు. దీనిని గురించి "జైనధర్మ" మనే గ్రంథంలో పేర్కొన్న వాక్యాలు గమనింపదగినవి.

"సర్వదైవ దురూహోఽయ మభక్తైర్భగవద్రసః
తత్పాదాంబుజ సర్వస్వైర్భక్తై రేవానురస్యతే"

(భక్తిరసామృత సింధువు)

"శ్రీ కృష్ణుని చరణ కమలములనే తన సర్వస్వముగా భావించుకొను శుద్ధభక్తులే యీ రసము ననుభవింపగలరు. భక్తిగంధ శూన్యము, జడోచిత భావ పరిపూర్ణ మునగు హృదయము గలవారు, సహజముగనే తమ సంస్కారములకు దగిన తర్కప్రియత్వము గలవారు ఈరసము నెప్పుడును అనుభవింపజాలరు. మనుష్యుని భావనా పథమును దాటి చమత్కార భావమేదియైన నొకటి శుద్ధసత్త్వో జ్జ్వలమగు హృదయమున నుదయించిన రసమని చెప్పబడును. ఆ భావము పరమ విశుద్ధము. పరమ చమత్కారపూర్ణము. రసము జడజగత్తులోలేదు. అది చిజ్జగద్వస్తువు. చిత్కణజీవుని సత్తాయందు ప్రకాశితమగును. భక్తి సమాధియందేరసము లక్షితమగును." అన్నమాచార్య శృంగార సంకీర్తన లట్టి భక్తిసమాధినుండి జనించినవి -

భక్తి - శృంగారాదులవలె, శుద్ధ అలౌకికం కాదు; శాంతమువలె, శుద్ధ ఆధ్యాత్మికం కాదు. అది ఈ రెండింటి మిశ్రప్రవృత్తి. అన్నమాచార్యుల శృంగార కీర్తనల వలనగాని, పోతన భాగవత పద్యాల వలనగాని కలిగే అనుభూతి ఎంత అలౌకికమో అంత ఆధ్యాత్మికం. ఈ మిశ్ర ప్రవృత్తినే మధురం అని అంటారు. మధురభక్తి అందువలననే మధురాతి మధురం,

శ్రీ రూపగోస్వామి తన భక్తిరసామృత సింధువులో నాయికా నాయకులను, వారి భేదాలను, హరిప్రియలను, వారి చెలులను, చెలికత్తెలను నిరూపించినాడు. వారందరు లౌకికంగా స్త్రీలుగా కనపడుతున్నా తాత్త్వికంగా జీవులని, తద్భావాన్ని భక్తితో ఏ పురుషుడైనా, ఏ స్త్రీయైనా సాధించవచ్చుననీ, అది అతీంద్రియమూ; అమలినమూ, పరిపూర్ణమూననీ పేర్కొన్నాడు. స్త్రీయలింగ భేదాన్ని మరచి మధుర రసమూర్తియైన శ్రీ కృష్ణుని సమారాధనం చేసే గోపికా తత్వంగానీ, రాధాతత్వంగాని పొందటం మహాభావమంటారు. శ్రీ రామకృష్ణ పరమహంస అటువంటి మహాభావ స్థితిని పొందాడు. యోగి భక్తిమార్గాన్ని ఆశ్రయించి మహాభావ స్థితిని పొందితే మహానుభావుడనిపించుకొంటాడు; కవి భక్తిమార్గాన్ని ఆశ్రయించి మహాభావస్థితి నందుకొంటే కావ్య సృజన వ్యాపారంలో అది ప్రతిబింబించి మహాకవి అనిపించుకొంటాడు. అన్నమాచార్య శృంగార నాయికా స్థితులను వ్యక్తీకరించే పెక్కు శృంగార సంకీర్తనలు వ్రాశాడు. వాటిలోని నాయికలు కవి మానసిక భక్తిస్థితులకు అభివ్యక్తులు.

తిరువేంకటాచలపతితో సంభోగము ననుభవించి వెడలిన నాయికను అన్నమాచార్యులు—

"లలిత లావణ్య విలాసము తోడ
నెలంత ధన్యత గలిగె నేటి తోడ
కుప్పలుగా మైననలుకున్న కస్తూరి తోడ
తొప్పదూగేటి చెమట తోడ
అప్పుడటు శశిరేఖలైన చనుంగవతోడ
దప్పి దేరేటి మోము దమ్మితోడ-
కులుకు కబరి భరము కుంతలపుమ్మెల తోడ
తొలగ దోయని ప్రేమతోడ-
మొలక నవ్వులు దొలకు ముద్దుజూపుల తోడ
పులకలు బొడమైన పొలుపు తోడ-

తిరు వేంకటాచలాధిపుని మన్నన తోడ
సరిలేని దివ్య వాసనల తోడ
పరికించ రాని అరవిరి భావము తోడ
సిరిదూరంగెడు చిన్ని సిగ్గు తోడ"

అని అభివర్ణించాడు. ఇది శృంగార రసపరంగా చెప్పితే సంభోగ శృంగారానికి ఆలంబన విభావం అవుతుంది కాని, వైష్ణవ భక్తిపరంగా సంభోగానికే అర్థం వేరు. "కృష్ణలీల ప్రకటాప్రకట దముతో రెండు విధముల నుండును· విప్ర లంభ రసమున వర్ణితమైన విరహావస్థ ప్రకటలీలానుసారమున్నది. కాని, బృందావనమున నెల్లప్పుడు రసాది వివిధలీలా వినోదమున విహారపరాయణు డగు శ్రీహరితో వ్రజస్త్రీల కెప్పుడును వియోగము కలుగదు. మధురామాహాత్మ్య మున నిట్లున్నది- "గోపికలతో కృష్ణడక్కడ క్రీడించును". 'క్రీడతి' యను నీ వర్తమాన క్రియాప్రయోగముచే కృష్ణక్రీడ నిత్యమని తెలిసి కొనవలెను. అందువలన గోలోకము- లేదా- బృందావనమునందలి యప్రకటలీలలో కృష్ణలీలకు దూరప్రవాస గత విరహత్వము లేదు. ఇచట సభోగమే నిత్యము" అని జైనధర్మగ్రంధం పేర్కొంటున్నది. ఈ తత్వాన్ని శ్రీవేంకటపతికి అన్వ యించు కొంటే మధుర భక్తి స్వభావం తేట పడుతుంది విరహాన్ని చిత్రించే నాయికా భావాలన్నీ సంభోగాన్ని పుష్టిమంతం చేసే రసభావాలే. అన్నమయ్య వైష్ణవ భక్తి సంప్రదాయాన్ని తెలుగులో మధురంగా అవిష్కరించాడు. నాయిక లలో, చెలులతో చిత్రించిన భావావస్థలు మధురస సముద్రంలోని తరంగాలు. మధురభక్తిని పద్యకవితలో అనుభవించాలంటే పోతన భాగవతంచదవాలి. సంకీర్తన సాహిత్యములో అనుభవించాలంటే అన్నమాచార్య శృంగార కీర్తనలు చదవాలి. తెలుగువారికీ రెండు ప్రక్రియల్లో భక్తిరసానుభావం దొరకటం వారి అదృష్ట విశేషం.

డా॥ ముట్నూరి సంగమేశంగారు వత్సలాదులను పోషించిన సంకీర్తనలను గురించికూడ ప్రస్తావించారు. ఇవి ముగ్ధభక్తికి మణిముకురాలు. అన్నమయ్య సాహిత్యాన్ని ప్రచురించి తిరుపతి తిరుమల దేవస్థానం పుణ్యం కట్టుకున్నది; అన్నమాచార్య అధ్యయన సంస్థను స్థాపించి ఆకృతులకు ప్రచారం చేస్తున్నది. యువభారతి అ పదకవితా పితామహునికి వాఙ్మయార్చనం చేసి తన భక్తిప్రపత్తిని ప్రకటించు కొంటున్నది.

అన్నమయ్య సంకీర్తనలు అచ్చమైన తేనెపెరలు. వాటిలోని కవిత్వం తెలుగు తియ్యదనం. వాటిలోనిభక్తి పారిజాత పరిమళం; వాటిలోనిశక్తి మధురాభివ్యక్తి.

—జి. వి. సుబ్రహ్మణ్యం

# అన్నమయ్య

-డా॥ ముట్నూరి సంగమేశం

## 1. అవతారిక

క్రీస్తుశకము 15-16 శతాబ్దములలో భారతీయాకాశమున నన్ని దిశలును భక్తి గీతములతో మారుమ్రోగినవి. ఆనాడు దేశమందలి ప్రతిప్రాంతముసందును అచ్చటి భాషలలో మధురాతి మధురములైన భక్తి గీతము లెన్నెన్నియో రచింప బడినవి. రచయితలు తమ భక్తి సాధనకంగముగా పద సాహిత్య నిర్మాణము నకు పూనుకొనిరి. భక్తి సగుణ పరమైనను, నిర్గుణపరమైనను, చిరంతన భారతీయాధ్యాత్మచింతన కనురూపముగనే కాలోచితమైన ప్రక్రియలనందుకొని ప్రతిధ్వనించినది. భారతీయ సాహిత్య చరిత్రమున నది భక్తియుగము. వెలసిన భక్తి సాహిత్యము నందెక్కువ భాగము విష్ణుపరము. రచయితలైన భక్తులలో కొందరు సుప్రసిద్ధులైన గాయకులు, రచన సంగీతమయము.

అదే కాలమున తెలుగునాట, హరికీర్తనాచార్యుడుగా, పదకవితా పితామహుడుగా ప్రసిద్ధిజెందిన భక్తకవి అన్నమాచార్యుడు (క్రీ.శ. 1424-1503) వెలసి శ్రీ వేంకటేశ్వరాంకితముగా వేలాది పదములల్లి సగుణవైష్ణవ భక్తిని ప్రచారము చేసెను. ఈ పద్ధతినే అతని పుత్రపౌత్రులుకూడ పాటించి తెలుగులో వైష్ణవ పదసాహిత్యము నపారముగా వెలయించిరి.

అన్నమాచార్యుడు ఆంధ్రప్రాంతమున నేటి కడపజిల్లా రాజంపేట తాలూకాలోనున్న తాళ్లపాక గ్రామమున జన్మించెను. చిన్నప్పటి నుండియు అతని హృదయము తిరుమల-తిరుపతి దేవుడైన శ్రీ వేంకటేశ్వరునియందే విశేషముగా లగ్నమై యుండెడిది. తుదకు పదునారేండ్ల ప్రాయమున తిరుపతి కేగుచున్న కొందరు యాత్రికులతో గలసి, యింటివారి కెరిగింపకయే అతడు, తిరుపతికేగి, తన దేవుని దర్శించి తన్మయత్వముతో పదములల్లి పాడసాగెను. ఇది గమనించిన వైష్ణవాచార్యులలో నొకరు, భగవత్ప్రేరితులై అతనిని చేరదీసి, విశిష్టాద్వైత సంప్రదాయానుసారముగా వైష్ణవదీక్ష నిచ్చిరి.

జన్మతః అన్నమయ్య అద్వైతియయ్యును సంస్కారముచే నిట్లు విశిష్టాద్వైతిగా మారెను. వీరిది నందవరీక బ్రాహ్మణ కుటుంబము. వీరు ఋగ్వేదులు ఆశ్వలాయన సూత్రులు. భరద్వాజస గోత్రులు. అన్నమయ్య నాటినుండి అతని కుటుంబము వారందరును వైష్ణవులై, వడహలి సంప్రదాయము ననుసరించుచూ విశిష్టాద్వైతమత ప్రచారమున నాచార్యులుగా కూడ వెలసిరి.

అన్నమయ్యజాడ లరసి వచ్చిన బంధువులతని నింటికి తీసికొనిపోయి, అతని వైరాగ్యమును కొంత సడలింప నెంచి, ఒకే ముహూర్తమున అక్కలమ్మ, తిరుమలమ్మ అను నిద్దరు కన్యలతో నతనికి వివాహ మొనర్చిరి. కాని ఈ వివాహ సంస్కారిమతని సాధన కాటంకము కాలేదు.

వివాహమైన పిదప అన్నమయ్య అహోబిలమునుచేరి, అచ్చటి మఠ స్థాపకులైన ఆదివన్ శఠకోపయతీశ్వరులవద్ద విశిష్టాద్వైత వేదాంతమును, ద్రావిడవేదమును నిష్ఠతోపఠించెను. ద్రావిడ వేదమనునది, తమిళభాషలో ఆళ్వారులు రచించిన నాలాయిర (నాల్గువేల పదముల) ప్రబంధము. అన్నమాచార్యుని రచనకు మూలప్రేరతమై స్ఫూర్తినిచ్చినదీ ద్రావిడ ప్రబంధమే. ఆనాడు తెలుగునాట వెలసిన వైష్ణవాలయములలో ద్రావిడ ప్రబంధమునందలి కొన్నిభాగములు వేర్వేరు సేవావిధులలో వినియోగపడుచుండెను. తెలుగు వైష్ణవులకు వానియర్థమంతగా తెలియకపోయినను, వేదమంత్రములతోపాటు వాటిని వల్లించవలసివచ్చుచుండెను, ఇది గమనించి అన్నమయ్య ద్రావిడ ప్రబంధపు పద్ధతినే అనుసరించి, అంతకెన్నోరెట్లధికముగా పదములురచించి తెలుగు వైష్ణవులకు సంప్రదాయ సిద్ధమైన భక్తి, వైరాగ్య, వేదాంత ధర్మనిష్ఠాదులు తేటతెల్లముగా తెలిసికొనుట కెంతగనో సాయపడెను. ఇది అన్నమయ్య నాచార్యునిగా నిరూపించి ఆళ్వారుల పంక్తిలోనిల్పెను.

గృహస్థాశ్రమములో నిల్చియే అన్నమయ్య తన భక్తిసాధన నిరంతరాయముగా కొనసాగించుకొనుచూ, అంతకంతకూ తీవ్రమొనర్చి, తుదకా స్వామిని ప్రత్యక్ష మొనర్చుకొని సిద్ధిబడసెను. సాధనాంగముగా అతడు స్వీకరించిన పదరచనా వ్యాసంగముకూడ నానాటికి నిత్యనూతన స్ఫూర్తితో విలసిల్లుచుండెను. అతడు గాయకుడు. ఏయూరికేగినను అచ్చట వెలసిన విష్ణుమూర్తిని కీర్తించుచూ, విశిష్టాద్వైత తత్త్వములు విప్పిచెప్పుచూ, భక్తి నుద్బోధించుచూ గొంతెత్తి పాడుచూ, తన్మయత్వమున గంతులువేసి యాడు

చుండును. ఏదేవుని విగ్రహములోనైనను అతని కంటికగపడునది శ్రీ వేంకటేశ్వర విగ్రహమే. అతని కవితలో రాముడు వేంకటరాముడు, నరసింహుడు వేంకటనారసింహుడు, రాధాకృష్ణులు రాధావేంకటరమణులు.

నానాటికి అన్నమయ్య కీర్తి విస్తరించి, ఎందరెందరినో శిష్యులనాకర్షించినది. ఆనాడా ప్రాంతపు మండలాధిపతియైన సాళువ నరసరాయులు కూడ అన్నమయ్యను తన గురువుగా గ్రహించి, రాజోచితమైన రీతిని సత్కరించెను. కాని, రాజు తనపై కొన్ని కృతులు రచించి పాడవలసినదని అభ్యర్థించినదే తడవుగా, అన్నమయ్య "శ్రీహరీ" అని చెవులు మూసికొని, భగవదర్పితమైన తనజిహ్వ నరాంకితము కాజాలదని స్పష్టముగాచెప్పి, రాజకోపమునకు గురియై, సంకెళ్లబడి, స్వామియనుగ్రహముచే నిడివడి, రాజునకు కనువిప్పు కలిగించెను.

అన్నమయ్య నేటి రాయలసీమ ప్రాంతమున నానాడున్న దేవళములెన్నిటినో దర్శించెను. ఇటు శ్రీరంగమునుండి అటు శ్రీజగన్నాథము వరకు యాత్రలరిగెను. నరసరాయల కోరికపై నతడు విజయనగరము కూడ పోయి వచ్చెను. తానేగినచోట్ల వెలసిన వైష్ణవ దేవతామూర్తులెన్నిటినో అతడు కీర్తించెను. శ్రోతల చిత్తమెరిగి తెలుగులోనేకాక ఒకప్పుడు సంస్కృత కూడ కీర్తనలు రచించి పాడి మెప్పొందుచూ. సంకీర్తనాచార్యుడని హరికీర్తనాచార్యుడని, పదకవితా పితామహుడని కీర్తినామములు గ్రహించెను.

అన్నమాచార్యుడు వ్రాసిన కీర్తనలు 32 వేలని, అతని మనుమడు చిన్నన్న సాక్ష్యము. కాని యిందులో సగభాగమునకుపైగా నేడలభ్యము. కీర్తనలేకాక అన్నమాచార్యుడు "సంకీర్తన లక్షణము" అనుపేర సంస్కృత భాషలో వ్రాసిన లక్షణ గ్రంథముకూడ నేడు లభింపదు. దానికతని మనుమడు చినతిరుమలాచారి వ్రాసిన తెలుగు పద్యానువాదము మాత్రము లభించినది. ఇట్లే అన్నమయ్య వ్రాసిన 12 శతకములలో ఒకే ఒకటిగా "వేంకటేశ్వర శతకము" మాత్రము మనకు మిగిలినది. అన్నమయ్య తదితర రచనలలో "శృంగార మంజరి" అను లఘు కావ్యమొకటి లభ్యమగుచున్నది. అన్నమయ్య కృతులు అతని పుత్రపౌత్రుల రచనలు రాగిరేకులపై వ్రాయించి తిరుమల తిరుపతి శ్రీ వేంకటేశ్వరాలయములో "సంకీర్తన భండారము"లో భద్రపరుపబడినను, కొన్ని రేకులెట్లో మాయమైనవి. నేడు మిగిలిన రేకులలో అన్నమయ్య

కృతులుగలవిగా గుర్తింపబడినవి రెండువేల వరకున్నవి. వీనిపై వ్రాసిన కీర్తనలు సుమారు 12, 13 వేల వరకు మిగిలి లభించుచున్నవి. తిరుమల-తిరుపతి దేవస్థానమువారీ సాహిత్యమును సంపుటముల వారీగా ప్రకటించుచున్నారు. ఇంతవరకు వీనిలో 29 సంపుటములు వెలువడినవి.

రాసిలో నిట్లిది ఎంత విస్తృతమో. గుణములో కూడ నంతగనే విశిష్టత నంది వెలసిన సాహిత్యము. కల్పనావైచిత్రికి, భావగాంభీర్యమునకు, వాక్చమత్కృతికి, భాషాసౌందర్యమునకునెలవై, సంగీత సాహిత్యములు మేళవించి, తర్వాతివారి కొరవడి బెట్టినట్లుండి, భక్తి శృంగారములు గుబాళించు నీ సాహిత్యమేయితర సాహిత్యమునకును తీసిపోదు. ఈ వెనుకటి కవులకెందరికోయిది స్ఫూర్తినిచ్చినది. అయిదు వందల యేండ్లనాటి వ్యావహారిక భాషలో వెలసిన యీ సాహిత్యము భాషాసాహిత్య ప్రియులైన తెలుగువారికి అన్నమాచార్యుడందించిన అమూల్యమైన సంపద. దీని గుణమెఱిగి పదిలపరచుకొనుట మనవిధి.

.....o.....

## 2. కావ్య సౌందర్యము - వస్తు వైభవము

అన్నమాచార్యుడు భక్తకవి. భక్తిభావముచే ప్రేరితుడై అతడు చిన్నతనముననే పదరచన కుపక్రమించి. ఆకార్యమా జీవితమునూ కొనసాగించుచూ వచ్చెను. పదరచన మతని భక్తిసాధనకు ప్రధానాంగము. తన యిష్టదైవమైన శ్రీ వేంకటేశ్వరునికి తుదివరకు సంకీర్తన సేవలర్పించి అతడు తరించెను.

అన్నమాచార్యుని పదములు రాగిరేకులపై "సంకీర్తనము"లని పేర్కొనబడినవి. కాని కీర్తన, పదము, సంకీర్తన, మున్నగునవన్నియు పాటలకు పర్యాయ వాచకములే. ఈ పదములు ముక్తక శైలిలో వ్రాయబడినవి. కథాసూత్రమేదియు లేనందున ప్రతి పదమును ప్రసంగ సాపేక్షమైయుండును. పురాణ కథలు, అవతార లీలలు, మున్నగు వాటికి ప్రసంగము లూహించుట కొంత సులభముగా నుండును. కాని శ్రీ వేంకటేశ్వర శృంగార లీలావర్ణనములో అది కూడ కొంత క్లిష్టముగనే కన్పించును. ఆ శృంగారము కూడ అధ్యాత్మ నిబద్ధమగుటచేత మరింత క్లిష్టముగా తోచును.

అన్నమాచార్యుని పదములు అధ్యాత్మ కీర్తనలనియు శృంగార కీర్తనలనియు రెండు విధముల వింగడింపబడి లభించుచున్నవి. సంఖ్యలో శృంగార కీర్తనలు హెచ్చు. దొరికినంతవరకు అధ్యాత్మ కీర్తనలు 2209. (ఇవిపూర్తిగా అచ్చయినవి.) శృంగార కీర్తనలు పదివేలకు పైగా నున్నవి. (ఇవికూడ చాల వరకచ్చయినవి.) పద మధ్యాత్మమైనను, శృంగారమైనను ముఖ్య వర్ణ్య విషయము భక్తి భావమే. అదే శాంత, దాస్య, వాత్సల్య శృంగారాది రూపములలో అందుకు తగిన స్థాయి సంచార్యాది సామగ్రినంది రసరూపమున వ్యక్తమగు చుండును. అన్నమాచార్యుని మనుమడు చినతిరుమలాచారి ఈ సందర్భమున వ్రాసిన పంక్తులు వీటి స్వరూపమును చక్కగా వివరించునట్టివి :

"శ్రుతులై శాస్త్రములై పురాణ కథలై సుజ్ఞాన సారంబులై
యతిలోకాగమ వీధులై వివిధ మంత్రార్థంబులై నీతులై
కృతులై వేంకటశైలవల్లభ రతిక్రీడా రహస్యంబులై
నుతులై తాళులపాక యన్నయ వచో మాత్నక్రియల్ చెన్నగున్"(1)

అధ్యాత్మ కీర్తనలు :

చినతిరుమలాచార్యుడు తెనిగించిన సంకీర్తన లక్షణములో అధ్యాత్మ పదముల లక్షణ మిట్లు చెప్పబడెను.

"వైరాగ్య వృద్ధికర గంభీరపద శ్రేణి పొసగ చెనుపుచు నగ్రా
మ్యారమ్య విష్ణు చరితో, దారములై యున్నజాలు ధరిణిన్ వెలయున్.
దేహాత్మేశ వివేకోత్సాహంబును లోకవేద ధర్మాధర్మా
ద్యూహాపోహంబులుగల, యాహరి సంకీర్తనంబు లధ్యాత్మంబుల్"(2)

తన్మయత్వము, తీవ్రానుభూతి, నిజాయితీ తనమునిండి వ్రాసిన యీ సంకీర్తనలు పై లక్షణము నింకను పొంతమొనర్చి. చెవిని బడినదేవాలు హృదయములో చోటుచేసికొని మారుమోగినట్లుండును.

అన్నమాచార్యుని అధ్యాత్మకవిత విస్తార వైవిధ్యములందు వెలసినది. ఇరువురాండ్రను గట్టుకొని గార్హస్థ్యము నెరపుచునే అతడు వైరాగ్యసాధనలో సతతోత్సాహశీలుడై జీవితము గడపెను. ఆకారణమున నతని అనుభవము లపారముగా విస్తరించి వైవిధ్యమందుకొన్నవి. కవితయు వానిననుసరించి నడిచినది. ప్రవృత్తి మార్గమున నిల్చి నివృత్తి నలవరచుకొనదలచిన సాధకు

అందరికివలెనే అన్నమాచార్యునికిని చింతా(క్రాన్తదైన్య సంతాపగ్లాని వైరాగ్యాది భావములెన్నో అనుభవమునకు వచ్చినవి. అతని అధ్యాత్మకవితలో ఆయా భావములత్యంత విశదరూపమున వర్ణింపబడినవి.

నివృత్తి మార్గమున మొదటిమెట్టు సంసార వైముఖ్యము. అది జీవితములో గడచిన అనుభవముల ననుసరించివచ్చిన నిర్వేదమునకు ఫలము. అన్నమయ్య జీవితమునందును జగత్తుపైననుకూడ పరిపూర్ణ వితృష్ణా విచికిత్సా భరితమైనదృష్టి అలవరచుకొని దానిని మరింత దృఢమొనర్చుటకై యిట్లూహించును.

"ఏమిగలదిందు యెంతకాలంబైన
పామరపు భోగమాపదవంటి దరయ (1)

తిరిగి వ్యంగ్యమెంచుచూ నిట్లు పలుకును.

"ఇదివో సంసార మెంతసుఖమో కాని
తుదిలేని దుఃఖమను తొడవు గడియించె"(2)

ఒకప్పుడతడీ లోకముకాఠి అజ్ఞాత కాశ్చర్య చింతాకులుడై విస్తుపోవును

"ఉదయాస్తమయములొక దినముననే
యెదుటనే యున్నవి యెంచినను
ఇదివో జీవులు ఎంచక తమతమ
(బదుకులు శతమని (భమసెదరు" (3)

సంసారమా సద్గతియా? యేదికావలసినది? ఏది హితమైనది? ఏదికాదు? ఈ (ప్రశ్నలకు నిశ్చయ పూర్వకమైన సమాధాన మొకప్పుడు దొరికినను వంట బట్టదు. సుఖాశతోచేసిన (ప్రయత్నము లన్నియు వమ్మై తుదకు దుఃఖమే మిగులు చుండును. వేరొకవంక కాలము చెల్లుచుండును. అందుకే అన్నమయ్య.

"అయ్యోపోయ (బాయము కాలము
ముయ్యంచు మనసుననే మోహమతినైతి.
చుట్టంబులా తనకు సుతులు గొంతలు జెలులు
వట్టియాసల బెట్టువారేకాక
వెట్టుకొని వీరు గడు నిజమనుచు హరినాత్మ
బెట్టనేరక వృధా పిరివీకులైరి" (4)

అని వాపోయినాడు. సంసారవ్యామోహము మాయాప్రభావ జనితము. అన్నమాచార్యుని మనమున "ఇందిరాపతి మాయలే యింతులు" కర్మముచే కాంతాసుతుల బంధమబ్బును. కర్మబంధ మెట్టివారికిని తొలగింపరానిది. కాని కర్మాధ్యక్షుడా పరమేశ్వరుడు కరుణించినచో అది తృటిలో తొలగును. కనుక "హరి గొలిచి మనుదురుగాక" అని అతని ఉపదేశము. కాని చెప్పినంత సులభమా ఆచరణము?

"మాయల సంసారము మరిగి నీ కర్మము
యీ యెడ నినుమరుగ దేటికో హరి
కాయజు కేళిపై దమి గలిగిన మనసు
కాయజు తండ్రి నీపై గలుగదేటికో." (1)

అని అన్నమయ్యయే దానితో పెనగి విసిగిపోవుచుండును. ఒకప్పుడు తన నేరమెంచి భగవంతునితో చెప్పి శరణమనుటకును లజ్జించుచుండును.

"ఏ నోరు బెట్టుకొని నిన్ను నేమని కావుమందును
నే నిన్ను దలచినది నిముషమూలేదు." (2)

భగవంతుడు పతిత పావనుడు. అశరణశరణుడు. ఆపదుద్ధారకుడు, పురాణములిందుకు సాక్ష్యము. అజామిళాదు లెందరో అతనిని తలచి అరనిముసములో తరించిరి. కనుక వేరొక పురుషార్థ మొల్లక హరి భజన మొక్కటి వరించినచో చాలు తరింపవచ్చునని అన్నమయ్య విశ్చయించి పలుకును.

"మరి యే పురుషార్థము మావంకలేదు మీకు,
అరువడము మాకేల అటువో నీకు........
భూమిలోన నీవు నన్ను బుట్టించిన ఫలంబు
యివల రక్షించే తొడుసి దొకటాయ." (3)

అదిగాక,

"నేనొకడ లేకుంటే నీ కృపకు పాత్రమేది
పూని నావల్ల నే కీర్తి బొందేవు నీవు."(4)

అని అతడా భగవంతునితోనే తెగించి పలుకును, వేరొకసారి ఇతర చింతలేమిటికి, అతడే గతియై అరసేటివాడు. అని నిశ్చింతుడగును. పరమ వైష్ణవుడై భగవత్కృపకు పాత్రత వడించితినని మరొకప్పుడు విర్రవీగుచుండును.

అన్నమాచార్యుడొకప్పుడేదో తనకును తన దేవునికి మాత్రమే సంబంధించినట్లు గూఢ సాంకేతిక భాషలో పదములల్లి వినిపించును.

లోకము లోపల తాటి చెట్టునిది
కైకొని హరి యెరుగవుగా నీవు,
కొంకక యడవి మాకులు గంపలు మేసి
బింకమెడల పారు పెను మృగము
వేంకటపతి దీని వెదకి కొనలేము
సంకెవాయ దీర్చవుగా నీవు"(5)

మరొకప్పుడావేశముతో శబ్దక్రీడ నెరపుచూ భక్తి చూపును.

పరమ పురుషహరి పరమ పరాత్పర
పరరిపు భంజన పరిపూర్ణ నమో
కమలాపతి కమలనాభ కమలాసన వంద్య
కమల హితానంతకోటి ఘన సముదయతేజా.
కమలామల పత్రనేత్ర కమలవైరి వర్ణగాత్ర (6)
కమల షట్క-యోగీశ్వర హృదయ తేఒహం నమోనమో॥

అన్నమాచార్యుని అధ్యాత్మ కీర్తనలు విశిష్టాద్వైత ధర్మప్రచారమున కూతగ్రలని ముందే వివరించితిని. అతని కవితలో స్తోత్రరూపమున సంస్కృతాంధ్రములలో రామకృష్ణ నృసింహ వామన హనుమద్విష్వక్సేన సుదర్శన శ్రీ రంగనాథ పాండురంగ విఠలేశ్వరుల యశోవర్ణన మనేక పదములలో లభించును. దశావతార స్తోత్రము పదులు వందలునున్నవి. ఈ స్తోత్రములలో కొన్ని జయగానములు, కొన్ని మంగళములు, కొన్ని ఆరతులు, కొన్ని కవచనములు, కొన్ని కేవలస్తుతులు. అవతార వర్ణనలలో రూపగుణస్వభావ లక్ష్య సిద్ధులొకచో వాచ్యముగను, వేరొకచో వ్యంగ్యముగను వలసినంత వైవిధ్యముతో గోచరించుచుండును. శైవ భేదముతో పునరుక్తులన్నియు కప్పిపెట్టినట్లుండును.

ఆధ్యాత్మకవితలో అన్నమయ్య నిత్యసేవలకు, ఉత్సవసేవలకు సంబంధించిన కీర్తనలెన్నో ఉత్సాహ భరితుడై రచించెను. ఇట్టి సందర్భము

లలో అతడు ఉత్సవమూర్తిలో నిజమూర్తినే సాక్షాత్కరింపజేసికొనుచూ హర్ష విస్ఫారిత నేత్రములతో ఆనంద నర్తిత హృదయుడై ఆ భగవంతుని అలౌకిక రూపలీలావైభవములెంతేని వర్ణించును. భావనాలోకమున సత్యచ్యుతమ భూమిలో నిల్చి ఆధ్యాత్మికపు టంచుల వరకు దృష్టిసారించి, ఉత్సాహోద్రేకభరితుడై, ఉచ్చైఃస్వరమున "తే శరణమహం తే శరణమహం, శైశవ కృష్ణ తే శరణం గతోస్మి" అని ఆలపించి గంతులు వేయుచుండును. అన్నమయ్య వ్రాసిన అధ్యాత్మ సంకీర్తన లన్నియు చివరి చరణమున విశిష్టాద్వైత ప్రపత్తి మంత్రమైన శరణాగతిని ధ్వనించుచుండును.

ఆచార్యుడై అన్నమయ్య తన కవితలో నీతి, ధర్మము, సదాచారము లోక సంగ్రహము మున్నగునవెంతేని చాటి చెప్పినట్లు వర్ణించెను. తన నాటి రాజుల స్వార్థ లోభ ప్రేరిత పాపాచరణమును కంటజూచినది చూచినట్లే వర్ణించుచూ విక్షుబ్ధ హృదయుడై అతడాక్రోసించి పలికిన పలుకులివి :

"వెరతు వెరతు నిందు వేడుకపడ నిట్టి
తురుచ బుద్ధుల నెట్లు కూడుదు నయ్యా
దేహ మిచ్చినవాని తివిరి చంపెడివాడు
ద్రోహి గాక నేడు దొరయటా
ఆహికముగ నిట్టి అధమ వృత్తికి నే
సాహసమున నెట్టు చాలుదునయ్యా"

  

ఇంటి వేలుపు వేంకటేశ్వరు డనవెంట
వెంట దిప్పెడివాడు విభుడటా
దంటనై యాతని దాసాను దాసినై
వొంటియుండెద నేమి నొల్లనో యయ్యా"

కలికాలపు బీభత్స మాతడు కంటికి కట్టినట్లు వర్ణించుచూ, ఆ కాలపు తురుష్కుల యాగడములు, దొరల దుడుకుతనములు, నిస్సహాయులైన ప్రజల

యగచాట్లను తలచి నిలువునీరగుచునే తిరిగి "తిమిరం చింతయు బాపగ తిరు వేంకటగిరి లక్ష్మీరమణుడెగతి" అని ఆ భగవంతునిపై భారముచేసి నెమ్మది పడుచుండును.

శృంగార సంకీర్తనలు :

అధ్యాత్మ సంకీర్తనలకన్న శృంగారసంకీర్తనలే అన్నమాచార్యుని రచనలో ఎక్కువగా లభించుచున్నవి. వాస్తవమునకివి లీలాపదములు. పరమేశ్వరుని ఆనంద లీలావిహారములే అతడెక్కువగా వరించిన వర్ణ్యవిషయములు. భక్తులదృష్టిలో లీలానందమే పరమానందము. లీలభగవంతుని స్వాభావికగుణము. అందుచే అది అతనికంటె భిన్నమైనదికాదు. కాగా, అనవరత లీలాభావనా సంబంధ స్థాపనాదికముచే తత్ప్రాప్తి నాసించుటయు, లబ్ధినందుటయు కైవల్యప్రాప్తి లేదా భగవత్ప్రాప్తియే అని భక్తుల నమ్మకము భగవల్లీలలు భక్తుల నుద్ధరించుటకే అని వారి విశ్వాసము. భగవదభిన్నమగుట చేత తల్లీలుకూడ వ్యాపక విస్తృత, నిత్యనూతన, చిరంతనాది లక్షణములతో సాధకుల హృదయాకాశమున సాక్షాత్కరించి, వారికి నిత్యానంద మొనగూర్చుచుండునని సిద్ధాంతము. సాధకుని లక్ష్యమిట్టి ఆనందరూప పరబ్రహ్మను సాక్షాత్కరింప జేసికొని, తదీయుడై మనుటయే. ఇట్టి లీలారసానంద సాధనకే భక్తలోకము లీలాగానమున విశేష ప్రవృత్తి నెరపుచుండును. అన్నమాచార్యునిలో ఇదే లీలారసానుసంధానము లీలగాన రూపసాధనగా మూర్తీభవించినది, విసువు పుట్టించు దీనాలాపములకన్న, విశేషానురాగ పూర్వకములైన లీలావర్ణనలు పద్యః ప్రమోదదాయకములనుట అనుభవ సిద్ధము. అన్నమయ్య యిదే మతమున అధ్యాత్మ పదములకన్న శృంగారపదము లధికముగా వ్రాసి భగవంతుని బాల కిశోర యౌవనలీల లనంతముగా నూహించి, విశద విస్తృతముగా వర్ణించి, తనదైన ఒకానొక రసప్రపంచమును నిర్మించెను.

వాత్సల్య వర్ణనము :

అన్నమాచార్యుడు వాత్సల్య భక్తివర్ణన కాలంబనముగా శ్రీ కృష్ణుని బాలకిశోర రూపములనే గ్రహించెను. ఈ పదములు రచించునపుడతడొకసారి యశోదగను, వేరొకసారి గోపికలలో నొకతెగను తన్ను భావించుకొని ఆత్మాశ్రయ పద్ధతిలో రచన సాగించెను, శ్రీ కృష్ణ చరితములోని ముఖ్య విషయము

లన్నియు నితడు తన కవితలో ఒడవెను ప్రతి పదము నెందును శ్రీ కృష్ణుని లౌకిక రూపమునేకాదు శ్రీవెంకటేశ్వరునితో నభేద భావ మగాత యాదించుచూ వచ్చెను ఈ పదములలో నధిక భాగము తిరుమల తిరుపతి శ్రీ వేంకటేశ్వరా లయములో జరుగు కృష్ణ జయంతి గోకులాష్టమి కృష్ణాష్టమి యంట ఉత్సవా వసరములలో విశిష్ట ప్రేరణయు విశేష స్ఫూర్తియు గ్రహించి రచించినవి ఆ కారణమున నివి తరచు ప్రశంసా రూపముననో వెలసినవి అయినను శ్రీకృష్ణుని లోకరంజక లోకరక్షక రూపములు రెండునూ వీనిలో సమప్రాధాన్య మంది వర్ణింపబడినవి

బలరామ కృష్ణుల బాలలీలలు వర్ణించుపట్ల అన్నమాచార్యుడెన్నోచోట్ల స్వతంత్ర కల్పనకు తావొసగెను ఈ కల్పనలానాటి ఆంధ్ర గ్రామీణ ప్రజా సంస్కృతికి అద్దము పట్టి చూపుచున్నట్లు వెలసినవి అప్పటివారి యిండ్లు వాకిండ్లు ఆచార్య వ్యవహారములు ఆటపాటలు ఉత్సవోల్లాసములు ఆశా మానసములు వంటివన్నియు కంటిముందు పెట్టి చూపినట్లు వర్ణించబడినవి

అన్నమాచార్యుని మతమున శ్రీకృష్ణుని జనన మీ లోకమున నసాధారణ మైన ఘటన అది విశిష్ట ప్రయోజనము కలది విశ్వ వ్యాపకమైన ప్రభావము నెరపనది శ్రావణ బహుళాష్టమినాడు రోహిణీ నక్షత్రమున అర్ధరాత్రమున లధర్మాంధ కారము తొలగి దర్శరూప శ్రీకృష్ణ చంద్రుని యుదయమైనది ఎక్కడి కంసుడు యికనెక్కడి భూభారము చిక్కువాప జనియించె శ్రీకృష్ణుడు అనియు అచ్యుతుడుదయించె నద్దమరేతిరికాడ మున్నిమి రాకాసులు మూర్తి పడిరి అనియు పట్టరాని ఆనందముతో అన్నమయ్య గొంతెత్తి యాలపించెను శ్రీ కృష్ణజన్మప్రసంగముగు వర్ణించుచూ అతడు చెప్పిన పదములెన్నో యున్నవి అన్నిటా అతడిట్టి ఆనందతన్మయత్వమునే వెల్లడించెను ఇదే తీరున నాతడు చిన్ని కృష్ణుని జాతకర్మ పుణ్యాహ పుత్రోత్సవ ప్రధమప్రాశ నాదులన్నిటినీమహోత్సాహముతో వర్ణించెను వ్రజాంగనల ఆనందము పట్టరానిది వారివాత్సల్యమపారము అందరూ బాలుని తొట్టెలోపెట్టి పాడునరికి పరిగాక వారితోచేరి లాలిపాట కంకించుకొనిరి గోపకాంతలు ముద్దుల కృష్ణుని రూప లావణ్యములకు మురిసి చేయి దింపక మెత్తి లాలించుచుండిరి ఒకప్పుడతని నోటలో ఒకామెకు బ్రహ్మాండమంతయు గోచరించును ఆమె భయపడు బాలునిదించి మిగతావారి కెరిగించును నమ్మకపోయినను యశోదకు గూడ వేరొకప్పుడట్టి దృశ్యము కానిపించును ఆమె గుండె జల్లుమని యిది యే ఎగాచ పీడయో యని శిశురక్ష ప్రక్రియ లెన్నెని జరుపును

బాలకృష్ణుని సర్వసమ్మోహన రూపమును చూచి ఆనందించుటకు శుక నారదాదులు ప్రచ్ఛన్న రూపమునవచ్చి పోవుచుందురు. వారతని వయోచితక్రమ పరిణామ రూపములలో వెనుకటి అవతార రూపములు చూచి ఆనందించు చుందురు. ప్రేమాకుల హృదయయైన యశోద చిన్నికృష్ణుని వేయికన్నులతో చూచి కాచుచుండును. రక్షః పక్షి దోషములకు వెరచి అతనిని వేళగానివేళలలో అటునిటుపోనీదు. అందరినీ ముట్టనీయదు. ఒకప్పుడామె బాలు నూరడించుటకై చందమామను చూపి,

"చందమామరావో జాబిల్లి రావో మంచి
కుందనపు పైడిగోర వెన్న బాలుదేవో."

అని యింకేమేమో పాడుచుండెను. ఈ లోపున బాలకృష్ణుడే సంజ్ఞ చేసెనో, నింగినున్న చంద్రుడు తటాలున భూమికి దిగి బాలకుని వద్ద వ్రాలెను. భయవిస్మయాకులితచిత్తయై కనులు మూసికొని, తల్లడిల్లి, యశోద కెవ్వుమను సంతలో నంతయు యథాపూర్వకముగా నమరియుండెను.

తల్లి యొడిలో నుండియే చిన్నికృష్ణుడు పూతనను, తృణావర్తుని, శకటా సురుని సంహరించెను. కాని తల్లికి నిరంతరాపాయ సూచనలు వెక్కసమగు చుండెను. ఒకప్పుడు,

"పాలార్చి తొట్టిలో బిండబెట్టి యశోద
నీలవర్ణు దొంగిచూచె నిద్దురోయని
ఓలిశంఖచక్రాలతో నురము శ్రీపతితోడ
యీ లీల శ్రీ వేంకటేశుడై యున్నాడు."

కొంచెము పెరిగిన కృష్ణుడెన్నొని బాలసులభ లీలావిశేషములు చూపి తల్లినేకాదు, ఊరిలోని వారిని, అటు బ్రహ్మాదులనుకూడ సంతసింపజేయు చుండెను. మరింత పెరిగి యిరుగు పొరుగుల కేగి పాలు వెన్నలు దొంగిలించ నేర్చెను. అంతకంత కారాటమెక్కుడై ఫిర్యాదుల వరకు వచ్చెను. సమవయ స్కులైన బాలురెందరో అతనికి సహాయకులైరి. అల్లరికంతులేదు. ఆగడము లకు కడిమిలేదు. ఫిర్యాదులతో విసిగి యశోద కృష్ణుని రోటగట్టెను. అదే అదనని ఆ రూపములోనున్న శ్రీకృష్ణుని, అతనిచే శాప విముక్తులైన నలకూబర మణిగ్రీవులేకాక, బ్రహ్మాదులుకూడ కీర్తింపవత్తురు. వేళ్లాకొలంక గోపికలు యశోదనే నిందించి కృష్ణుని విడిపింపవత్తురు.

బలరామకృష్ణుల బాలక్రీడలకు ఊరంతయు మైదానమే. ఊరిలోని బాలులందరూ వీరికి మిత్రులే. ఒకప్పుడు వారు బంతియాడుదురు. వేరొకప్పుడు "కర్ర-బిళ్ళ" ఆడుదురు. పుట్టచెండ్లు-బిళ్ళగోంట్లు, సముద్రపుబిళ్ళలు. సిరి సింగనవత్తులు, దాగిలిమూతలువంటి వెన్నియో వారాడుచుందురు. పశులు గాచుచూ యమునాతీరమున నింకెన్నియో ఆటలాడుచుందురు. అన్నమాచార్యుడీ సందర్భమున ఆనాటి గ్రామీణ బాలబాలికలలో ప్రచారములోనున్న ఆటలెన్ని టినో పేర్కొనెను. అందులో "అల్లోనేరళ్ళు" వంటి ప్రాతని "పులి-మేక" వంటి క్రొత్తవి కూడ వినిపించును.

ఆటలాడుచునే కృష్ణబలరాము లెందరినో ధూర్తరాక్షసులను సంహ రించిరి. ఇంద్రుని గర్వమణచిన కృష్ణుడు బ్రహ్మకు మోహనివారణముకూడ చేసిపెట్టెను. కాళీయుని భంజించెను. దావాగ్ని చల్లార్చెను (4) దారిగాచి గొల్ల తళ్ళనాపి వారమ్మబోవు పాలు పెరుగు లూరకనే గ్రహిస్తి యారగించుచుండెను ఒకప్పుడు వారితో పరసములాడి సయ్యాటలకు దిగుచుండెను. (5) ఒకసా. మురళివాయించివారిని సమ్మోహితముతోముంచెత్తును వేరొకసారి కిన్నెరవాయించి ఆహ్వానించును. (6)

ఇన్ని వర్ణించిన అన్నమాచార్యుడు ఆకాలపువారు శ్రీకృష్ణునితో కలిసి మెలిసి తిరిగియు నతని తత్త్వమెరిగి తరించలేదేమిః అని తనలో తాను విత ర్కించుకొనును.

"ఏల మోసపోయిరో ఆకాలపువారు
బాలకృష్ణుని బంటులై బ్రతుకవద్దా
పశులగాచేటివాని బ్రహ్మ నుతించెనంటేను
దిశల దేవుడవి తెలయవద్దా
శిశువు గోవర్ధనగిరి చేతబట్టి యెత్తె నంటె
కొసరి యతని పాదాలే కొలువవద్దా. (7)

అన్నమాచార్యుని కవితలో శ్రీకృష్ణుని బాలలీలలన్నియు వర్ణింపబడినవే కాని వాటికొక క్రమములేదు. యోగమాయా ప్రకరణమును వర్ణించినంత వివ రముగా చీర హరణాదులు వర్ణించలేదు. రాసక్రీడాదులు కేవల సూచనలుగా మిగిలినవి. వాత్సల్యముకూడ సంయోగపక్షముననే వర్ణింపబడినది. వియోగ పక్షము గ్రహించలేదు. అసుర సంహారలీలలైనను సూచనలుగా వినిపించినవే

గాని వివిధముగా వర్ణించినవికావు. కాని అంతటా శ్రీకృష్ణుని భగవత్స్వరూప ముసు. శ్రీవేంకటేశ్వరునితో నతనికభేదమును మాత్రము విడువక ధ్వనింప బడుచూ వచ్చినవి. వాస్తవమునకివి శ్రీవేంకటేశ్వరాలయములో శ్రీకృష్ణజయంతి ఉట్లపండుగ వంటి ఉత్సవములలో సమయోచితముగ శ్రీకృష్ణచరిత్ర మెత్తుకొని పాడిన పాటలు. పైగా, అన్నమయ్యకు ఒరవడిగా వెలసిన ఆళ్వారు ప్రబంధ ములలోకూడ శ్రీకృష్ణచరిత్ర అట్లే సూచ్యప్రాయముగను క్రమవిరహితముగనే వర్ణింపబడినది. అయిననేమి, అన్నమాచార్యుని చింతవేరు. అది క్రమము తప్పినదనికాదు, అదను తప్పినదని.

"అయయ్యో ఏమరినా నప్పుడేమయి యుంటినో
అయ్యెడ నీదాసినై తే ఆదరింతువుగా
అల్లనాడు బాలుడవై ఆవుల గాచువేళ
చిల్లరదూడనై తేచేరి కాతువుగా
వల్లెగావిటుడవై వ్రేపల్లెలో నుండువేళ
గొల్లెతనైనా నన్నుకూడు కొందువుగా"

శృంగార వర్ణనము :

భరతాచార్యుని మతమున (నా.శా. 6-40, 41) లోకములో ఏది పవిత్రము, శ్రేష్ఠము, ఉజ్జ్వలము, దర్శనీయమునగునో అది శృంగార మనిపించు కొనును. అట్టి శృంగారము భగవన్నిష్ఠమై భక్తిపూతమైనప్పుడది సర్వోత్కృష్ట మనుట వేరుగా చెప్పనక్కరలేని సిద్ధాంతము. ఈ సిద్ధాంతమే శృంగారమును భక్తిసాధనతో నుత్తమోత్తమముగా స్వీకరింపజేసినది. అన్నమాచార్యుని భక్తి సాధనలో శృంగారము ప్రధానాంగముగా రూపొందినది. ఆత్మాశ్రయ పక్కిలో రచింపబడుటచే అన్నమాచార్యుని శృంగారకవిత భక్తిభావ బంధురమై, కవి హృదయానుభూతుల నాపాత మధురముగా వెల్లడించుచున్నది. కథానిరపేక్షమై, కేవల భావాశ్రిత ప్రసంగ ప్రవణముక్త రచనముగుటచేత, ఈతని రచనలో శృంగారము లౌకిక వాసనలకు దూరమై అలౌకికపుటంచుల వరకు సాగినది. విశిష్టాద్వైతియై, జీవాత్మపరమాత్మలకు "అపృథక్ సిద్ధ సంబంధ" మంగీకరించి విశ్వసించిన అన్నమాచార్యుని కవితలో ఉద్దామవిరహ కల్పనకేకాని, చిరవిరహ వర్ణనమున కవకాశములేదు. అందుకే అతని కవితలో ప్రాణాంతక వియోగ

దశావర్ణనముకూడ సంయోగరూప స్వీకృతిని ధ్వనించి ముగియుచుండును. అధ్యాత్మ కీర్తనలలో ప్రపత్తిని, శృంగార కీర్తనలలో స్వీకృతిని ధ్వనించి అన్నమయ్య తన సిద్ధాంతమునకు చెరగని ముద్రవేసి కృతి ముగించుచుండును.

నాయకుడు :

అన్నమాచార్యుని భక్తికాలంబనము తిరుమల-తిరుపతి యాలయములో వెలసిన శ్రీ వేంకటేశ్వరుని అర్చామూర్తి. అది విష్ణుని అర్చారూపమే, కాని అవతార (విభవ) రూపముకాదు. కాని ఈ భక్తకవి ఆ మూర్తిలోనే శ్రీమహా విష్ణువుని సమస్త విశ్వలీలా విహారములను సాక్షాత్కరింప జేసికొనెను. అతని కామూర్తి ప్రత్యక్ష దైవము. అతని హృదయమునకు కావ్యమునకు కూడ ఆ శ్రీ వేంకటేశుడే నాయకుడు. అన్నమాచార్యుడు తన్నాదేవుని నాయికగా భావించుకొని నాయకుని దివ్యసుందర రూప గుణాదికము హర్ష పులకాశ్రు గాద్గదికముతో వర్ణించి మురియుచుండును. తిరిగి అతనినే శ్రీ వేంకటాచల శృంగారమూర్తి. నవసావయవ సాకార శరణు శరణు" అని శరణ మొందు చుండును. అతని దృష్టిలో వేంకటేశ్వరుడు,

"గోపాంగనల మెరుగు గుబ్బచన్నులమీద
చూపట్టు కమ్మ కస్తూరి పూత యితడు............"
జలధి కన్యాపాంగ లనితే క్షణములలో
కలసి వెలుగుచున్న కజ్జలం బితడు,
జలజాసనుని వదన జలజ మధ్యమునుండి
అలర వెలువడిన పరమామృతం బితడు."

నాయిక అలమేల్మంగ :

వాస్తవమునకీకవితలో అన్నమాచార్యుని భక్తాత్మయే నాయిక. కాని తాదాత్మ్య భావమెంచి అతడింకెందరు నాయికలుగనో రూపొందుచుండును. వీరిలో ప్రధాన నాయిక శ్రీ వేంకటేశ్వరుని యర్థాంగి అలమేల్మంగాదేవి. ఆమె సాక్షాల్లక్ష్మి. సహజ సుందరి. ఈ సహజ సౌందర్య సంపదతోనే స్వామి వర్ఛించి ఆమె అతని అనితర సులభ వాల్లభ్యమును వరముగా బడసినది. "కవికి నీ కనుచూపు కలువరేకుల పూజ, లలన నీ నగవు మొల్లల పూజ అవి, అన్నమయ్య వేరింకేమి వలయునని ప్రశంసించును. ఆమె స్వాంపు

లాభరణములకే ఆభరణములని చెప్పి యొప్పించుచుండును.

''శ్రీ వేంకటేశు కృప చెలియ కెప్పుడు దొడవు
భావ సంగతులకును బరవశమె తొడవు
యీ వెలది నును బల్కు లించు విల్తుని తొడవు
లావణ్యములకు నీ లలన దా దొడవు.''

ఆ విభుని రాచసిరి కామె పెట్టని కోట.

''అతివ జవ్వనము రాయలకు బెట్టని కోట
పతి మదన సామ్రాజ్య భారంబు నిలుప''
కాంత కనుచూపు మేఘంబు లోపలి మెరుగు
కాంతుని మనంబు చీకటి వాపను
ఇంతి చక్కని వదన మిందుబింబము విభుని
వంత కనుదోయి కలువల జొక్కజేయ.''

నాయికారూపవైభవ వర్ణనమున నన్నమాచార్యుడెన్నెన్నియో ఆలంకారిక ప్రక్రియలు నెరపి క్రీడించెను. అంతటా ఉపమోత్ప్రేక్షా రూపకాతిశయోక్త్యాది అలంకారముల దీప్తికి తోడు సమయ సందర్భ పాత్రౌచిత్యాదులెంచి, కవి పరంపరా ప్రసిద్ధములను మించి విషయానురూపముగా ప్రయోగించిన ఉపమాన వస్తు భండారము నిగ్గులొల్కుచుండును. సౌందర్యమును సహజ సిద్ధముగా వర్ణించుటకంటె తత్ప్రభావమును వ్యంజించుచూ వర్ణించుటలో నీ కవి మిక్కిలి గడుసరి.

**ఇతర నాయికలు :**

అన్నమాచార్యుని శృంగార కవితలో గోపికల ప్రేమ భక్తి కూడ వర్ణింపబడినది. కాని యీ నాయికలు స్వీయ వ్యక్తిత్వమున్నవారుగా కనిపించరు. గోపికలవలెనే రాధకూడ వర్ణింపబడినది. తరచుగా నామె ప్రణయకేళీ రతవిదగ్ధ నాయికగా చిత్రించబడినది. అష్టమవాషులలో నొకతెగా, స్వకీయగా చిత్రించుచునే అన్నమాచార్యుడామెకుగల ఆధ్యాత్మిక సంకేత స్వరూపమును గూడ వ్యంజించు చుండును.

'రాధా మాధవ రతి చరిత మిదం
బోధావహం శ్రుతి భూషణం

గహనే ద్వావపి గత్వా గత్వా
రహసి రతిం ప్రేరయతి సతి
విహరత స్తదా విలసంతౌ
విహత గృహేశౌ వివశౌ తౌ.'

శ్రీవేంకటేశ్వరుడు వెలసినది తిరుమలకొండమీద. కనుక అచ్చటి భిల్ల కిరాత యువతులును అన్నమాచార్యుని రచనలో శృంగారనాయికలుగనే గ్రహింపబడిరి. వీరు తరచు పరకీయలుగా చిత్రింపబడిరి. గోపికలవలెనే వీరును విదగ్ధ వాక్చతురలుగను, వ్యంగ్యోక్తి నిపుణలుగను, ప్రగల్భప్రౌఢ నాయికలుగను తీర్చి దిద్దబడిరి. దానలీలా ప్రసంగము లెన్నిటికో యీ నాయికలు ప్రధానముగా గ్రహింపబడిరి.

**దూతికలు, చెలికత్తెలు :**

నాయిక చెలికత్తెలు కూడ అవసరోచితముగా నాయికలై, నాయకుని సహచరులుగానో, నాయికానాయకుల మధ్య దౌత్యము నెరపు వారుగానో, సందర్భించినప్పుడు స్వయందూతికలుగానో మారి వ్యవహరించుచూ వీరు నాయకునితో నుచిత ప్రేమానుబంధము సాధించుచుందురు. వీరిలో ప్రియసఖి, నర్మసఖి, ఆంతరంగికసఖి, దూతి, పరిచారికవంటి వారెందరో తారసిల్లుదురు. కాని వీరికి ఊరు పేరులుండవు. కవి కూడ వీరిలో నొకతె యై వ్యవహరించుచుండును. ఒకప్పుడు తానును ఖండిత నాయికవలె నభినయించుచుండును. వేరొకప్పుడు 'వేంకటేశు దాసి'నని చెప్పి తన స్థితి నెరిగించుచునే, తన అనురక్త హృదయమును సైతము నాయకున కెరిగించుచుండును. నాయిక పరముగా వచ్చి దౌత్యము నెరపుచునే తన సంగతి కూడ జ్ఞప్తికి తెచ్చుచుండును. తిరిగి చనవెంచి బెదిరించినట్లు 'న చలతు వేంకటనాథ మావితినా విచరణమపి తే వృథా వృథా' అని పల్కి తమ అనుబంధ మవినాభావ మైనదని తెలుపుచుండును.

**పూర్వ ప్రణయము :**

అన్నమాచార్యుని కవితలో పూర్వ ప్రణయమును వర్ణించు పదము లెన్నో లభించును. నాయికా నాయకుల ప్రణయ వైభవము నతడెంతో విశిష్టముగా, క్రమ పరిణామ విశదముగా వర్ణించెను. ముక్తక రచనలో నిది అసాధారణము. కథగాని, ఘటనా క్రమముగాని లేని తన శృంగార కవితలో

అన్నమయ్య నాయికా నాయకుల ప్రణయ పరిణతికొక క్రమము కల్పించి, ఏ యొకకు అంగమును, ఏ యొక్క దశను, ఏ స్థితిని కూడ విడువకుండ వర్ణించి చూపెను. నాయికా తాదాత్మ్య మెంచిన కవి యాత్మకా యీ దశలన్నియు స్వానుభవ గోచరములైనట్లు రూపించును.

అన్నమాచార్యుని కవితలో నాయికా నాయకులు జగదేక దంపతులు. వారి ప్రణయ మీనాటిది కాదు. అది అనాది సిద్ధము. అందుకే 'కలికి కోరికల నుంగరము బెట్టిన నాడె చెలువంపు విరహాగ్ని చేసెగా పెండ్లి' అనియు అది మొదలా దివ్య సుందర నాయకుని రూప గుణాతిశయమే విశ్వమంతయు నిండి కాన్పించుచున్నదనియు, ఆతని సామీప్య సాహచార్యాదులంది కైదండ పట్టి అలరి అలరింపవలె నను సభిలాష లంత కంతకు విరహాగ్ని నెసకొల్పు చుండె ననియు కవి వర్ణించెను. నాయకుని పొందాసించి నాయిక చేయు ప్రయత్నము లట్టిట్టివి కావు.

''తగిలిన మునులే యాతని గందు రంటా
మగువ ఎవ్వరితోను మాటాడ దిపుడు.
అతుల నిరాహారు లతనికి ప్రియులంటా
అతివ నిన్నటినుండి యారగించదు.
తతి నడవులనుండే తపసులే యతనికి
హితులంటా వనములో నెడయ దీ తరుణి.''

''తలకొన్న యతనిపై తలపే పరమంటా
చెలియ చెక్కిట నున్న చెయి దియ్యదు,
వలనైన యతడు దేవతల కొడ యటంటా
కలికి రేయి పగలు కనుమియ్య దిపుడు.''

నాయిక సంప్రాప్త యౌవన. ఆమెలో యౌవనోచితమైన హావభావము లుదయించుట తోడనే కాగల శ్రీపతి పొందునూ సూచించుండెను. ఆమె క్రీడా భవనమున నిల్చి పంజరములోని చిలుకకు వేంకటేశుని పేరు చెప్పి పఠింప జేయును. నాయకుడదే వెరవుననో వినివచ్చి నన్నేల పిలిచితివని యడుగును. ఒకప్పుడామె మేడమీద విహరించును. నాయకుడదే తరుణమన్నట్లా వీధినే పలు మారు సంచరించును. ఆమె చూడబోవు సరికి దాటిపోవును, చెలులెంచి చూప బోవుదురు. కాని అంతలోనే ఆమెకు తనువెల్ల పులకించి చెక్కులు చెమరించును.

నిరంతరమతనినే ధ్యానించుట చేతనేమో నాయిక కొకప్పుడాతడు కలలో ప్రత్యక్షమగును. గడసరి చెలికత్తెల కామె మోహమెంత దాచినను బట్టబయ లగుచుండును.

అటు నాయకుడును నాయికకై పరితపించుచుండును. ఈమె కెంత మన్మథ తాపమో అతనికంత రెక్కుడ మదన పరితాపము. అంతంతగా చేరి అతనిని గమనించి వచ్చిన చెలులు నాయికతో నిట్లు చెప్పుదురు.

'వెదజల్లు నీమోము వెన్నెలలు దలచి పో
పొదలు వెన్నెల బయట బొలయడతడు...
లలితాంగి నీదేహలత దలచిపో యతడు
చెలగి వనమునకు విచ్చేయ డిపుడు...

అతడెప్పుడును నాయికనే స్మరించును. ఎవరినడిగినను ఆమెను గూర్చియే అడిగి తెలిసికొన నెంచును. ఎరుకతకు చేయిచూపి తన భాగ్యమెట్లున్నదో చెప్పు మనును.

**దౌత్యము :**

నాయికా నాయకుల స్థితి గమనించిన సఖీజనము అదనెరిగి నాయకునివద్ద కేగి కార్యము సాధింపనెంతురు. వారతని వద్దకేగి నాయిక పరిస్థితి నెరిగించి 'తరుణిపై మరునికీ దయలేదు. నీవు మరునినే పోలితివి మరియేటి బ్రతుకు' అని చెప్పి దీనికేదో ప్రతీకారము చేయుమందురు. నాయిక అసామాన్య సౌందర్య వతియే కాని నాయకుడేమి సామాన్యుడా; అందుకని నేరుపుగా పలికి అతని నాకర్షింపజూతురు.

'చెలి చక్కదనములు చేరి నీతో చెప్పేనంటె
మలసి నీవైతేను మరు గురుడవు
పొలసి యాపె నేరుపులు పొగడే నందేను
అలరి నీవు మాయా నాథుడవు'

అని ప్రారంభించి ఆంతరంగిక సఖి అతనినే మేలేదోయెంచి ఉపాయ మెరిగింపుమనును. కాదన్ననూ.

'నీవంటి చతురనకు నిక్కంబుగా వలచి
జీవంబు బాసినా సేగి గలదా !
భావముల నినుదలచి పడతి యిట్లయ్యెనని
ఆవేళ నను దలపు మంతియే చాలు'

అని ఆఖరుమాటగా చెప్పివచ్చును. నాయకుడు కొంత సుముఖుడగును. తిరిగి వచ్చిన సఖిని జూచి నాయిక ఆమెను కౌగలించుకొని 'తానెటుల నున్నాడు తరుణి వినిపింపవే కానక నినుగన్న నతని గన్నట్లాయె' నని పల్కి మరల మరల నతనిని గూర్చియే ప్రశ్నించును.

నాయకుడెట్లో సమయముచూచి నాయికవద్దకు వచ్చి నిల్చును. కాని ఆమె కతనిని జూచినదే తడవుగా హర్షావేగ లజ్జాజాడ్యము లొక్కసారి ఆవహించినట్లై స్వాగతోపచారముల సంగతినే మరపించును. చివరకు ప్రణామ మొనరింపనెంచియును, అంతకన్నముందే ఒడలు అతని పాదములపై వ్రాలును.

'ఏమిసేతు నా భాగ్యము మెరిగి యెరగనీదు
నా మోహమె మిక్కుటమై నన్ను దడబరచెను
గ్రక్కున నీవెదురైతే కడుసిగ్గు రేగుంగాని
పెక్కు ఉపచారాల మెప్పింప మరతు
తక్కక నీవంటితేను తమకమే నిండుగాని
చొక్కించి నా చేతలు చూపింపమరతు'

అని యేకాంతమున నాతనితో తన తడబాటునకు సమాధానము చెప్పుకొనును. నాయికా నాయకులొకచోట కలిసి సుఖించుట కళ్లు గలిగి భాగ్యముగా చూచి సంతసించుచూ చెలులు తమలో తామిట్లాడుకొందురు.

''భామ యౌవన మనెడి పాలజలనిధిలోన
నామాక్షియైన యౌవనలక్ష్మి గలిగె
యీ మంచి తిరువేంకటేశ్వరుండిందులో
ప్రేమమున సుఖియించి పెంపొందగలిగె''

రూపకముగా భావించినప్పుడీ ప్రసంగమంతయు జీవాత్మపరమాత్మల ఫలస్వర విరహాను భూతిగను, సఖీజనుల యుపచారము లద నెరిగి చేసిన గురూపచారాది ప్రయత్నములుగను స్పష్టమగును.

సంయోగ లీలా వర్ణనము

అన్నమాచార్యుని కవితలో సంయోగ లీలలు రెండువిధములుగా చిత్రింపబడినవి. అందొకటి ప్రధానము. అది అలమేల్మంగా వేంకటేశ్వరుల సంయోగలీలావర్ణనము. అది సుఖసమృద్ధి మయమై ఆనాటి నాగరిక విలాస జీవితమున కద్దము పట్టినట్లుండును. రెండవది గౌణము. అది భిల్ల కిరాత గోప కాంతలలో శ్రీ వేంకటేశ్వరుడు నెరపిన సహజ సరళ గ్రామీణ విలాస భరిత మైన సరస సంయోగ లీలావర్ణనము.

అలమేల్మంగా వేంకటేశ్వరులు లోకైక దంపతులు. వారి శృంగారము లౌకికమును ఆదర్శభరితమును భగవదీయమునునై భక్తి భావోపేత శృంగార ముచే వ్యంజించుచుండును. ఆ అతిలోక దంపతుల అనురూప శృంగార లీలా విలాసములలో అత్యంత సాన్నిధ్యమంది యానందించుటయే సఖీజనుల యాద ర్శము. గౌణరూపమున వర్ణించిన గ్రామీణ నాయికా శృంగారమున దాన మాన సపత్నీ భావాదులెక్కువగా వ్యక్తమగుచుండును.

నాయకుని దక్షిణనాయకత్వమునకు కవి నితాంత ముగ్ధుడై మురియు చుండును. నాయకుని ప్రశంసలతో పాటు కవి ఆయా నాయికల వాల్లభ్య సౌభా గ్యములు కూడ పొగడుచుండును. అతని కవితలో నాయికా నాయకుల శృంగార లీలలకు విడిది వసతులుగా అభ్యంతర మందిరము, పుష్పోద్యానము, క్రీడా సరో వరము, కౌతుకగృహము మున్నగున వెన్నో గ్రహింపబడెను. ఊయెల, వసం తము, జలకేళి, వన విహారము, వేట వాహ్యాళి వంటి వెన్నో సంయోగ శృంగార వర్ణన కుపయుక్తమైన ప్రసంగములుగా గ్రహింపబడినవి. చతురంగము, కందుకక్రీడ, సంగీతము, నృత్యము, కొలువు కూటము మున్నగునవి సఖీ సహచరుల సంగతినే సరస సల్లాపముల కనువైన యవసరములుగా గ్రహింప బడినవి. అశ్వగజాందోళికా చతురుత యానాదుల పైవిహారములును శృంగారోప యుక్తములుగనే తీర్చిదిద్దబడినవి. వాస్తవమున కివియన్నియు ఆలయములో ఉత్సవమూర్తుల కొనరించు సేవలు. కాని అన్నమాచార్యుడు వీటినా జగదేక దంపతుల సహజ విహార విలాసములుగనే చూచి, వానిలోనే తన నాయకుని సాక్షాత్కరింప జేసికొనుచుండును. ఉయ్యాలలో నున్న ఉత్సవమూర్తులలో దేవీ సహితుడైన దేవరయే అతని కగపడును.

అలర చంచలమైన ఆత్మలందుండనీ
అలవాటు జేసె నీ యుయ్యాల.........
కమలకును భూసతికి కదలు కదులుకు మిమ్ము
కౌగలింతగ జేసె నుయ్యాలా
కమనీయమూర్తి వేంకటశైలపతి మీకు
కడువేడుకాయె నీ యుయ్యాలా"

పాన్పుపై నున్న ఉత్సవమూర్తు లొకపరి ఆ భక్తకవి కంటికి నిజ రూపముననే గోచరింతురు. పతిపద సేవా నిమగ్నమైన నాయికతో నతడు సమయోచిత రీతిగా నిట్లుపదేశించి పల్కెను.

'రంగు మీరిన మంచి రత్నాలు దాచిన నీ
వుంగరాలచేత పాదమొత్తకుపమ్మా
అంగన పుట్టెను పాచ మంటి శిలను తొల్లి
కంగి నీకు ప్రతి మొన గడియించు జుమ్మీ'

సంయోగ శృంగారమును వర్ణించుపట్ల అన్నమాచార్యుడు నాయికా నాయకులను లౌకిక పరిధికి దిగజారనీయడు. ఏ పరిస్థితిలోను ఇది భగవదీయ మను సంగతి తాను మరచిపోడు. అడుగడుగునా ఈ సత్యము ధ్వనించి పాఠ కులను కూడ పెడత్రోవ బట్టనీయక నడిపించుచుండును. ఉద్దామ శృంగార లీలలు వర్ణించునప్పు డొకొక్కచోట పచ్చి పచ్చిగా నున్నట్లు తోపించుచునే, తిరిగి యే సంకేతరూపముననో అది భగవదీయమను సంగతి స్పష్టపరచు చుండును. ఈ క్రింది సంయోగచిత్రము గమనింపదగినది. నాయికా నాయకు లేకాంత మనుభవించుచుండిరి. మోహావేశమున నాయక కేమో శృంగారలీలలు స్ఫురించినవి. ఆమెకు,

'పడిపడినె తమ్మలము వీడు దోడాడ మన
సడరీని తలపవెరపయ్యాని
వడి లోకమేలు దేవర దివ్యవదనంబు
కడునెంగిలని యొరులు గందురో యనుచు'

ఇట్టి లోకైక నాయకుని పరించిన దగుటచేతనే నాయిక అతని గుణ గణములేమి, ఉక్తివిలాసములేమి, ఉపచార విధులేమి, ఏది తలచినను మరువ

రానంత గాఢముగా మనసున నత్తుకొని, నిరంతర చింతాస్మరణానురక్తయై ధ్రువానుస్మరణమంది తన్మయీ భావమున సుఖించుచుండును. ఈ క్రింది రత్యంత నాయికా వర్ణనము.

'పలుకు తేనెల తల్లి పవళించెను
కలికితనమున విభుని గలిసినది గాన.
నిగనిగని మోముపై నెరులు గెలకుల జెదర
పగలైన దాక జెలి పవళించెను
తెగని పరిణతులతో తెల్లవారిన దాక
జగదేక పతి మనసు జట్టిగొనె గాన.
కొంగుజారిన మెరుగు గుబ్బలొలయగ దరుణి
బంగారుమేడపై బవళించెను
చెలువ కనుగొనల సింగారములు దొలక
అంగజగురునితోడ నలసినది గాన.
మురిపెంపు నటనతో ముత్యాల మలగుపై
పరవశంబున దరుణి పవళించెను
తిరువేంకటాచలాధిపుని కౌగిట గలసి
అవిరై నును జెమట లందినది గాన.

**మాన వర్ణనము :**

శృంగారభక్తిలో మానము సాధకుని అసమగ్రసిద్ధికి, తన్మూలకమైన వ్యాకులతకు సంకేతము. భక్తుడు నిరంతరము తన ప్రియుడైన భగవంతుని సాన్నిధ్య సాహచర్యములు వరించుచుండును. ఇందుకే మాత్రమైనను ఆటంకముగాని, అట్టి అనుమానముగా నిరూపించినచో మానమున కవసరము సిద్ధించును. నాయకుడు దక్షిణ నాయకుడగుటచేత అన్నమాచార్యుని కవితలో మానవర్ణనమునకు అడుగడుగునా అవకాశము చిక్కుచూ వచ్చినది. కాని నాయకుడు లోకాధిపుడు. అతనిని సామాన్యపురుషునిగా తలచినచో అది భగవదపచారమగును. మానమెంచి మంకుపట్టు పట్టి కూర్చొనుటగాని, నాయకుని నుండి అనునయ వినయము లాసించుట గాని అనౌచిత్యమునకే దారితీయును. కనుకనే అన్నమాచార్యుని నాయిక వినయోక్తులాడుచున్న ప్రియుని వారించి తన మానాభినయమున కేనాడో స్వస్తి చెప్పి యిట్లనుచున్నది.

'నను వినయో క్తై ర్నియోగ్యాహం
పునః పున స్త్వం పూజ్యోసి
దినదిన కలహ విధినా తే కిం
మనసిజ జనక రమారమణ'

చరాచర జగత్తున కంతటికీ యేకైక నాయకుడైనందున శ్రీవేంకటేశ్వరుని నాయికకు సపత్నీ మూలమున ఈర్ష్యాతాప క్రోధామర్షాదులు అవాంఛితములయ్యూనూ అనురాగ మిశ్రితములై అనుభవింపనగుచుండును. ఆ యా సమయములలో నామె మానినియై విరహవ్యథ ననుభవించుచుండును. కాని, భగవదీయమైన యీ నాయికయందు శ్రేష్ఠ నాయికోచితమైన గర్వ భావమునకు మించి వేరొక భావ ముదయించదు. అన్య సంభోగ దుఃఖిత అయ్యును, తన్ననునయింపవచ్చిన నాయకునితో నామె పలికిన పలుకులివి.

'అంజలి రంజ విరయంతే
కిం జనయసి మమభేదం వచనైః
దైవం బలవత్తరం భువనే
నైవ రోచతే నర్మమయి
ఏవం భవదిష్టం కురుకురు
శ్రీవేంకటాద్రి శ్రీనివాసః'.

అన్నమాచార్యుని కవితలో నాయకుని మానమే ఎక్కువగా వర్ణింపబడినది. తరచుగా నాయిక కతని పంతమే వియోగహేతు వగుచుండును. అన్నమాచార్యు డొకప్పుడు తానే నాయికయై, మానము వహించి, ప్రియుని చేష్టలకు విసిగి కలహింపజొచ్చును.

'ఎవ్వతెకైనా చనవిచ్చేవు మెచ్చేవు నీ
నవ్వులకైనాను మన్నను జూచేవు
అవ్వలి యివ్వలి నీ యంగనల వొద్దను
పవ్వళించి వుండగా పాదము లొత్తుదునా'
'నేనే నాయికకు తక్కువ?' అని యీ ఖండితకు గల స్వాభిమానము.

**వియోగవర్ణనము :**

భక్త కవులందరును భగవద్విరహ మనుభవించిన వారే. వారు తమ రచనలలో ప్రత్యక్షముగనో పరోక్షముగనో ఆర్తి అనుభూతి యథార్థముగా

వర్ణించు చుందురు. అన్నమాచార్యుని కవితలో నిట్టి విరహ మతిశయముగా వర్ణింపబడెను.

భగవంతునికి దూరమైన వారికీ ప్రపంచమున వేరొక యాధార మేముండును. దైవ విరోధియై యీ లోకమున మనుటయే దుర్భరము. భగవద్విరహమున తపించు నాయిక స్థితి యిట్టిదే యగును. భగవంతుడైన నాయకుడా మాత్రము మొగము చాటుచేసెనా చాలు ఆమెతో నీ ప్రపంచ మంతయు విరోధించును. చల్లగాలులు వేడి గాడ్పులగును, చందమామ యెండ గాయును. ఉద్యానములోని పూవులే కాదు. నాయిక చేతిలోగల పద్మములు కూడ వికటించును. వనములోని శుకశారికాదులే కాదు, చేతనున్న క్రీడా శుకము కూడ వైరమెంచును. చివరకు ప్రకృతియే విపరీత గతినంది వేధించును. ఈ ప్రగాఢ సంతాప వేళలో ఆమెకు తన మీద తనకే జాలి గలుగుచుండును.

'ముచ్చట కెవ్వరు లేరు మోహమిది బలుదూరు
యెచ్చట నెవ్వరు లేరు యేటికే నా పేరు
మంచముపైనుండరాదు మలగుపై బొద్దుపోదు
నించిన వుయ్యాలలో నిద్దురరాదు
అంచెల గన్నుల నీరు ఆపరాదవని బాసి
యించుకంత నిలువలేనెట్లు ధరియింతునే."

వేదనాతిరేకమున నామె తన శరీరమును మరచునే కాని నాయకుని మాట మరవదు. క్షీణకంఠముతోనైనను అతని నామమే పల్కి, అతనిని గూర్చియే చెలుల నడుగుచుండును. నాయకునితో కలిసి సుఖించిన నాటి సంగతులెంచి యామె మరింతగా తపించుచుండును. అంతకంతకు కృశించి 'వత్తివలెదేహమెల్లవాడబారిన'దని కళవళపడి చెలులామె పరిస్థితినంతయు నాయకుని కెరిగింపబోదురు.

'వనిత భాగ్యంబు దేవరచిత్తము మాకు
బనిగాదు యింక నీ పాదంబు లాన
అడబాలసతి బోన మారగింపుమటంచు
బడిబడిని కడువిన్నపము సేయగా
ఉడుగని పరాకుతోనుండి నెచ్చెలి మీద

బడలి వొరిగినది నీ పాదంబు లాన
ఆలసట్టము విసరు సతివలను వలదనదు
పాలిండ్లపై కొంగు పచరించదు
యేలాగవునొ వేంకటేశ నీవిపుడిట్టె
పాలించకున్న నీ పాదంబులాన.'

బహు వ్యాపకుడైన నాయకుడు వెనువెంటనేరాక కొంత తడయుటతో నాయిక మరింతగా తపించును. 'చలముకొని వేడి వెదజల్లు నూర్పులతోడి నెలత గని కట్టెదుర నిలువ వెరపాయె'నని ఉపాయమెరుగక చేతులు తడవుకొని, చెలులు తబ్బిబ్బుపడి తడబడుచున్న సమయమున నాయకుడు వచ్చి ప్రయత్యక్షమాయెను. నాయికకు ప్రాణము లేచివచ్చినట్లుయ్యెను.

'ప్రాణము సందియమైన యీ పడతికి బ్రాణమువచ్చెను
ప్రాణేశుడు తిరువేంకటపతి కరుణించినను
ఏణాక్షికొకతెకు గాదీయఖిలంబున కీ దేవుడు
ప్రాణము ప్రాణంబనియెడు పలుకిది నిజమాయె.'

అని చెలికత్తె లారాట ముడిగి సంతసించిరి.

**నిర్వహణమున విశిష్టత :**

అన్నమాచార్యుని శృంగార భక్తిలోని విశేషము నాయికా నాయకులనే పరిస్థితిలోనూ లౌకిక స్థాయికి దిగజార్చకుండుట. ఆతని కవితలో నాయికా నాయకుల దివ్యత్వమున కేమాత్రము భంగము కలుగదు. వేంకటేశ్వరుడన్ని పరిస్థితులలోను ఉదాత్త గంభీరుడుగనే రూపించును. భిల్ల కిరాత నాయికల సాంగత్యమునందుకూడ అతని సర్వేశ్వరత్వము లోపించునట్లుండదు. శ్రీకృష్ణ రూపమునందును ఆ నాయకుని దివ్యావతారమూర్తియే అధికముగా నిరూపింపబడుచుండును.

నాయిక అలమేల్మంగలో అన్ని వేళలా దివ్యత్వమే ప్రకాశించుచుండును. ఆమెలో మానినీ రూపము కన్న అభిమానవతి రూపమే అధికముగా గోచరించును. ప్రాణోత్కటమైన విరహావస్థలో కూడ ఆమెలో అభిసారికగానో విప్రలంభిగానో మారిన రూపముగాని, అట్లగుటకైన ప్రయత్నముగాని కనబడదు. ఆ జగదేకమాత అన్ని పరిస్థితులలోను మధుర గంభీరమూర్తిగనే కనిపించును. పూర్వ ప్రణయమున గురుజనులవలని భయముగాని, ప్రణయలీలలలో పరకీయా భావమ్ముగాని ఆమెలో చూపి చిత్రించుట కవకాశమే లేదు. అలమేల్మంగతో

నాత్మ తాదాత్మ్యమందిన కవి తన నాయికా రూపము నన్నిచోట్లను 'అనామక' నాయికగనే చిత్రించి, మూలమున నామె సహజ దివ్యోదాత్త రూపమునకు భంగము రానీయలేదు. దాదిగానో, దాసిగానో తన్నూహించు కొన్నప్పుడు కూడ అన్నమాచార్యుడు నాయకుడైన వేంకటేశ్వరుని యందెట్లో, నాయిక అలమేల్మంగ యందును అట్లే భక్తి భరితమైన స్నేహాదరము చూపుచుండును. వ్యక్తిగా తన్నామె కాచార్యుడుగనో గురుజనుడుగనో భావించి కళ్యాణోత్సవము నెరపి కన్యాదాతయై అతడు తన భావమునకు రూపకల్పన చేసికొనెను.

అన్నమాచార్యుని రచనలో సంయోగ వియోగదశలు వివిధ మానసిక దశావైచిత్రులతో చిత్రించబడినవి. విభిన్న పరిస్థితులు కల్పించి, వివిధ ప్రసంగములూహించి, ప్రణయలీలలు వర్ణించుటేకాదు, అట్టి సమయ సందర్భములలో ప్రేమికులనుభవించు వివిధమనోవృత్తి విభేదములను భావదశలను కూడ అన్నమాచార్యుడు వ్యంజించుచుండును. అతనికవితలో ప్రకృతి వర్ణనము తక్కువ. అసలు లేదనిన తప్పులేదు. ప్రతిపదమునందును ప్రకృతముతో పాటు అప్రకృతముగా ఆధ్యాత్మిక సంకేతము లందించుట అన్నమాచార్యు డెన్నడును మరచిపోడు.

**అన్యరస భావములు**

భక్తి భావ ప్రేరితుడై తత్సాధనగా రచించిన తన సంకీర్తనలలో అన్నమాచార్యుడు ప్రధానముగా శాంతవాత్సల్య శృంగారములు వర్ణించిననూ ప్రసంగోచితముగా తక్కిన రసభావములను కూడ వ్యంజించెను. ఆనుషంగికముగా ఎన్నెన్నో సంచారి భావములు విశద విస్తృతముగా ధ్వనించెను. సంయోగ వియోగదశలు రెండింటి యందును హర్షేర్ష్యామద నిర్వేదాదు లత్యంత మధురముగా వర్ణించెను. ఇదే విధముగా నిద్ర, జాగరణము, మతి, తర్కము వంటివి వాటి ననుసరించి వచ్చిన సంచారు లెన్నిటితోనో కలిపి వర్ణించెను.

పై నింతవరకు ఉదాహరించిన పంక్తులు గమనించినచో అన్నమాచార్యుని రచనలో గల అనుభావముల కూర్పును అంగభంగిమాది ముద్రలందించు నేర్పును స్పష్టముగా గోచరించును. విభుడలిగినట్లు వినినదే తడవుగా తలమాన్కలైన చింతా సంతాపములంది నిల్చిన నాయికా చిత్రమీ క్రిందిది. దీనిలో కవి నాయిక యందప్పుడు వ్యక్తమైన హావ భావాదిక మంతటికినీ ఫొరగని ముద్ర వేసి చూపినట్లు వర్ణించెను.

'ఇంతి కన్నీరొలుక నిట్లు జదివె
కొంతంపు కనుగొనల కోపముం జదివె
వెలది వినుకలినే వినికి కిని తోడనే
తలపోతనదివె చింతన సేసెను
తలకొన్న నేల వ్రాతలనె పొలుపుగ వ్రాసె
తొలుత బాదపులేవి ధూళక్షరముల"

అన్నమాచార్యుడు సహజముగా హాస్యప్రియుడు. సఖ్యవాత్సల్యములలో హాసపరిహాసములకు కావలసినంత చోటుగొని అతడు తన నైజహాస్య ప్రవృత్తిని వెల్లడించినాడు. వేంకటేశ్వరునే అతడు పరిహాస మాడగలచనవరి. కొండ మీద వెలసిన వేంకటేశ్వరుని స్థితిని తర్కబద్ధ మొనర్చి, ఆ దేవుని కూడ నవ్వించి చెప్పిన పల్కులివి.

'సామాన్యమా పూర్వ సంగ్రహంబగు ఫలము
నేమమున బెనగొనియె నేడు నీవక
ఉండనీయక జీవనోపాయమున మమ్ము
కొండలను గొబలతలి గొని తిప్పు ఫలము
కొండలను నెలకొన్న కోనేటి పతివనగ
నుండవలసెను నీకు నోపలే ననక''

## 3. కావ్య సౌందర్యము-శిల్ప సంపద

కవి తన లోకానుభవము శాస్త్రజ్ఞత, కావ్యమర్మజ్ఞత, సురుచి, ఔచిత్యము మున్నగున వెన్నిటినో సక్రమముగా నుపయోగించుకొనుచూ తనదైన ఒకానొక శైలి నేర్పరచుకొని ప్రస్తుతమైన ప్రధానవర్ణ్యముతోపాటు అప్రస్తుతమైన మరొక కళాప్రపంచమును పాఠకుల ముందావిష్కరించుచుండును. ఇట్లు ప్రస్తుతా ప్రస్తుతములు రెండింటినీ రసోపస్కారములుగా తీర్చిదిద్ది అందించుటలోనే కవి సామర్థ్యము స్పష్టమగుచుండును. అన్నమాచార్యుని కవితలో వెలసిన వస్తు వర్ణన భావ చిత్రణములను తత్సౌందర్య వైభవమును ఇంతవరకు చూచితిమి. ఇప్పుడతని కళావిదగ్ధతను శిల్పసంపదను గమనింతము.

**అలంకార నిర్వహణము :**

కావ్యమునం దలంకారములకు గల ప్రాముఖ్యమందరూ గుర్తించిరి. కాని అవి అలంకార్యమైన రసమున కనుకూలముగా నుండిననాడే సహృదయ

హృదయాహ్లాదకరము లగునని గ్రహించిన కవులు రసోపస్కృతికి సహాయ కారులుగనే అలంకారములు కూర్చుచూ వచ్చిరి. కొందరు రసాలంకారములకు సమప్రాధాన్యమిచ్చి రచన సాగించుచూ వచ్చిరి. అన్నమాచార్యుని కాలము నాడీ పద్ధతియే ఎక్కువగా అనుసరింపబడుచూ వచ్చినది. నాచనసోమనాథా దుల శైలీ ప్రభావ మానాటి తెలుగుకవులపై విశేషముగా గోచరించెడిది, ఉత్ప్రేక్షా, రూపకాతిశయోక్తి, వ్యాజోక్తి, వక్రోక్తి, భేదోక్త్య సంగత్యాది అర్థా లంకారములు, సుదీర్ఘమైన సాంగరూపకములు, ముద్రాలంకారములు, పరి సంఖ్య, ఏకావళి వంటి ప్రౌఢాలంకారములు ఆనాటి కవుల రచనలలో విశేష ముగా గ్రహింపబడుచూ వచ్చినవి. అన్నమాచార్యుని కవిత కూడ ఇదే పద్ధతికి సన్నిహితముగా సాగినది. కాని అతడు సహజకవి. కావ్యమర్మజ్ఞుడు. భావుకు డైనభక్తుడు. కనుక అతని రచనలో అలంకారములు చాలవరకు రసానుకూల ముగనే కూర్చి నిర్వహింపబడినను, కొన్నిచోట్ల కేవల చమత్కృతులుగనే నిల్చిపోయినవి. అలంకారములు కేవల మలంకృతికే ప్రయోగింపబడిన చోట్ల మనకతని శక్తి యెక్కువగా గోచరించునే కాని, రక్తి అంతగా కలుగదు. దీనికీ క్రింది పదము ఉదాహరణముగా గ్రహింపవచ్చును.

"ఇన్ని రాసుల యునికి యింతి చెలువపు రాశి
కన్నె నీ రాశి కూటమి గలిగిన రాశి
కలికి బొమవిండ్లు గల కాంతకు ధనురాశి
వెలయు మీ నాక్షికిని మీనరాశి
కులుకు కుంభముల కొమ్మకును కుంభరాశి
చెలగు హరి మధ్యకును సింహరాశి."

నాయికలో పొడసూపిన వయోచిత విలాస వైభవమును అంగ సౌందర్య మును రాసులు పోసినట్లున్నదని చెప్పుచూ, కవి సమయ సిద్ధములైన ఉప మానము లాధారముగా గ్రహించి అన్నమాచార్యుడీ పదమున మేషాది రాశులనే కరువుపెట్టి ముద్రాలంకారము నిర్వహించెను. ప్రయోజనము కేవల చమ త్కారమే. మచ్చుకు మరొకటి.

"చింతల చిగురులె చిచ్చులట
యింతటిలో నిక నేలాగె.
చక్కని మన్మథ సంవత్సరమున

చుక్కల రాజే సూరియుడై
యెక్కువ రాత్రుల యెండగాయునట
యెక్కడి దిక బ్రతుకే లాగే
కాంతల నడుముల గరపయ్యెడి నట
అంతట జవ్వన పామనిని
వింత మీన శని వెలదుల కన్నుల
నెంత గనమౌనా యేలాగే''

విరహిణియైన నాయికతో సఖి పలికిన మాటలివి. 'మన్మథ' సంవత్సర మను మాటతోనే 'మీన శని'వంటివి కూడ జోడించి కవి యీ పదములో నాయికా విరహోద్రేక భయాకులతను సూచించెను. ప్రకరణగతముగా విరహదశ కొంత సరసముగా వ్యంజింపబడిననూ చమత్కార పక్షమే దానిని మించి వ్యక్తమగు చున్నది.

'ఇంతి భువనమోహిని యైన ఫలము
కాంతుని దలచి వగలు జిక్కె నిపుడు
మెలత కన్నులు గండుమీలైన ఫలము
తొలకు రెప్పల నీరు దొరగె నేడు
లలనమై నవ పుష్పలతయైన ఫలము
వలపు చెమట నీటి వడిదోగె నిపుడు'

ఈ పదములో కవి సమయ ప్రసిద్ధమైన ఉపమాన వస్తువులు గ్రహించి హేతుప్రత్యయము లుగ్గడించుచూ నాయికా సౌందర్యముతో పాటు ఆమె నావ హించిన విరహచింత కూడ వర్ణింపబడినది. కాని ఉపమానోపమేయములు రెండింటి యందునూ సాదృశ్య సాధర్మ్యములు కవి కల్పితములే యగుటచేత కవి ప్రౌఢోక్తి సిద్ధ చమత్కారమునకు మించి సిద్ధించినది స్వల్పము. అయినను ప్రకరణ మెంచినచో కొంత సరసత తోపకపోదు. నాయిక విరహిణి. వియోగ దుఃఖమున కంట నీరు బెట్టుకొని ఉపాయ మెరుగక తపించుచున్నది. ఈ బింబ మామె మూర్తిని ముందు బెట్టి చూపినట్లుండి పై చమత్కారమును కొంత మర పించుచున్నది.

అన్నమాచార్యునిలో కనిపించు నీ చమత్కార ప్రియత్వము కాలప్రభా వమున నేర్పడినది. ముక్తక శైలియు, రచనా బాహుళ్యము నగుటచేత నిది యెక్కువగా కనిపించినను మరికొందరితో పోల్చినపుడు తక్కువగనే రూపిం చును. అన్నమయ్య స్వతంత్ర్య వ్యక్తిత్వము గల కవి. అతడాకాశ మంత యెత్తున కల్పించి భావనా లోకమున బాహాటముగా విహరించి రాగలడు. రసార్ద్ర హృదయుడై తన్మయీ భావముతో భగవల్లీల లభివర్ణించిన యీ కవి సహజము

గనే రసౌచితి నెరిగి తదనుకూలముగా అలంకారములు కూర్చి నిర్వహించిన పట్టెన్నో యున్నవి. ఈ క్రింది సంయోగ లీలా చిత్రము నుదాహరణముగా గ్రహింపవచ్చును.

''సురుచిర కేతక సుమదల సఖరైః
వరచిబుకం సా పరివృత్య
తరుణి మసింధే తదీయ దృగ్గ ల
చర యుగళం సతస క్తం చకార
హరిసుర భూరుహ మారోహతీవ
చరణేన కటిం సంవేష్ట్య
పరిరంభణ సంపాదిత పులకైః
సురుచిం జాతా సుమలతికేవ''

ఇందులో 'తరుణిమ సింధువున దృగ్గలచరములను సంసి క్తము గావించె' ననుటలో నేత్రముల చంచలత్వము, తద్ద్వారా సంయోగ లీలా జనిత హర్షవేగ లజ్జాదికములు ధ్వనించుచున్నవి. అట్లే పరిష్వంగ సుఖముచే పులికిత గాత్ర యైన నాయికను వృక్షాధిరోహణ మొనర్చు సుమలతికతో పోల్చి, హరినే కల్ప వృక్షముగా నిరూపించి, కవి భక్తాత్మను పరమాత్మతో కలిపి, తజ్జనిత హర్ష పులకాంకురితగా సూచించెను. ఇది నిగూఢ వ్యంగ్యము.

'వనితాకుచయో ర్వరనఖరేఖా
ర్జన శశి చిహ్నం సఫలమిదం
ఘన కరుణామయి ఘటయచంద్ర ఇ
త్యనునయ కారణ మహోభవతి.'

ఇందులో ప్రస్తుత సంభోగచిహ్నములు వర్ణించుచునే, సమయమెంచి విరహకాలీన చంద్రోపాలంభన చంద్ర ప్రార్థనాదులను సరసముగా తలపించి కవి తన రచనా ప్రౌఢిమను నిరూపించెను.

గోచరవస్తువును సుపరిచితమొనర్చి స్ఫుటముగా హృదయ గ్రాహ మొనర్చుటకు వేరొక గోచరవస్తువును ఉపమానముగా గ్రహించుట సాధారణ ముగా కవులందరియందును కనిపించును. ఒకప్పుడు అగోచర వస్తువునకు గోచరవస్తువును, అట్లే గోచరవస్తువున కగోచర వస్తువును ఉపమానముగా గ్రహించుట కూడ పరిపాటిగనే కన్పించును. కాని అగోచర వస్తువున కింకొక అగోచర వస్తువు నుపమానముగా కూర్చుట ప్రౌఢకవుల పద్ధతి. ఈ క్రింది పదములో అన్నమాచార్యు డిదే పద్ధతి ననుసరించి అగోచరములైనను, లోక సామాన్య సుపరిచిత వస్తు వ్యాపారముల నెన్నిటినో ఒకే యూపున ఉపమా నోపమేయములుగా పేర్చి యందించెను.

'ఎట్టు చేసిన జేసెనేమి సేయగవచ్చు
చుట్టపు విరోధంబు సూనాస్త్రి చెలిమి.
ఒడవి లోపలి రోగ మొసర బరితాపంబు
కడుపులోపలి పుండు కడలేని యాస
తడిపాత మెడ గోత తలపు విషయాసక్తి
గుడిమీద తరువు అలగులము ప్రాణులకు.
నీడలోపలి యెండ నెలకొన్న బంధంబు
గోడపై సున్నంబు కొదలేని యెరుక
పాడూరిలో బ్రతుకు పాప కర్మపు బుద్ధి
తాడుపై తపసు తమ ధనము ప్రాణులకు.
మంట జేసిన బొమ్మ మనికి సంసారంబు
రెంటికిని గాని పీరడి కొలువు బ్రతుకు
ఇంటి వేలుపు వేంకటేశు గొలువక పరుల
వెంట దిరుగుట ఒడ విడిచి వదరిడుట.

అన్నమాచార్యుని కవితలో ఉత్ప్రేక్ష లనన్య సామాన్యములు. అతిశయోక్తులుగాని, అత్యుక్తులుగాని అతడంతగా ప్రయోగింపడు. హేతువులు కూర్చి చెప్పినప్పుడు అసంభావ్యములన్నట్లు కల్పించి చెప్పడు. నాయికతో పల్కిన యీ క్రింది సఖీవాక్యములోని చాతుర్యము గమనింపదగును.

'సొలపు నీ కడగంటి చూపు హృదయము గాడి
లలి నతడు శ్రీవత్సలాంఛనుండాయె
వెలది నిను బెడబాసి విరహంపు మెయి కాక
వలన నాతడు నీలవర్ణుడైనాడు.'

సాంగరూపకములలో అన్నమాచార్యుడు కృషి, వాణిజ్యము, రాజనీతి, ద్యూతము, యాగము, యుద్ధవ్యూహమువంటి వెన్నిటినో అప్రస్తుతములుగా గ్రహించి అత్యంత విశదముగా చిత్రించెను. అతని కవితలో రూపకాతిశయోక్తి లొకవంక ప్రస్తుతమును సందర్భోచితముగా వర్ణించుచుచే వేరొకవంక అప్రస్తుతమును కూడ రసోదంచితముగా చిత్రించుచుండును. ఈ క్రిందిది మానినీ విరహ వర్ణనము. కాని ప్రకృతివర్ణన వలె రూపించి సందర్భమునకు మరింత వన్నె తెచ్చుచున్నట్లు వెలసినది.

'కోవిల్ల పలుకదు కొమ్మావి లతల
దైవికమిదియో తలక్రిందాయె.
ఇటునటు యినుడదె యెండలుగాసీ
పటుగతి గిరుల నభమునను

అటువలె గప్పిన యంధకారమదె
నిటలపు టిలుకల నిక్కములాయె.'

వ్యంగ్య విరోధమూల కాలంకారములను అన్నమార్యుడు సోద్దేశ్యముగా హాస్య వాక్చాతురి వెలార్చుచూ ప్రభావోత్పాదక శక్తి నధికము చేసి ప్రయోగించుచుండును. అవతార వర్ణనములలో నతడిట్టి విరోధము నెక్కువగా తడవు చుండును.

'ఎవ్వడో కాని యెరుగరాదు కడు
దవ్వులనేవుండు తలపులోనుండు
ఎడయవు తన రెక్క లెగసిపోలేడు
కడు దాగు గాని దొంగయును గాడు
వడిగ్రిందు పడును సేవకుడును గాడు
వెడగుగోళ్ళువెంచు విటుడును గాడు
మిగుల బొట్టివాడు మింటికిని బొడవు
జగడాలు తపసి వేషములును
మగువకై పోరాడు మరి విరక్తుండును
తగుగాపు పనులు నెంతయు దెల్లదనము,'

శబ్దాలంకారములలో నన్నమయ్య కనుప్రాస మధికప్రియమనిపించును. నాద సౌందర్యమున కుత్కర్ష కలిగించుచూ సంగీతమునకు తోడ్పడునట్టి యీ అలంకార మతనికి ప్రియమగుట సహజమే. తెలుగు కవితలో గల యతిప్రాసములు అనుప్రాస వికారములే. అన్నమాచార్యుని కవితలో తెలుగుపదములే కాదు, సంస్కృత పదములును యతిప్రాసములతోనే కూర్చబడినవి. మచ్చున కొకటి చాలు. ఇందులో ప్రాసయతి కూడ గమనింపదగినది.

'భవ ఘోర తిమిర దుర్భవ కాలమార్తాండ
భవ భద్రమాతంగ పంచాననా
భవ కమలభావ మాధవరూప శేషాద్రి
భవన వేంకటనాథ భవరోగవైద్య.'

అన్నమాచార్యుని అలంకారవిధానములో ముఖ్యముగా రూపించునది అతని లోకానుభవము. ఆధ్యాత్మ కీర్తనలలో దృష్టాంతము. ఉదాహరణము వంటివెన్నో అలంకారములు కూర్చి అతడు లోకనీతి, న్యాయపద్ధతి, దైవభక్తి మున్నగునవి సూచించు సూక్తి వైచిత్రి నెంతగనో ప్రదర్శించెను.

**భాష :**

ముక్తకగేయ శైలిలో రచింపబడినను అన్నమాచార్యుని పదములు సంగీతము కంటె సాహిత్యమునకే సన్నిహిత బంధువు లనిపించును. అతడు

గ్రహించినది తన నాటి యాంధ్రమున శిష్ట వ్యవహారమున నున్న భాష. అది కూడ వర్ణ్య విషయమును, పాత్రౌచిత్యమును బట్టి కొంత శైలీ భేదము చూపు చుండును. అతని శైలి దేశిశైలి. ఆ కారణమున అతని కవితలోతత్సమ శబ్ద బాహుళ్యముగాని, సుదీర్ఘ సమాసములు గాని అంతగా కనిపించవు. లోక ప్రచలితమైన తద్భవదేశ్య శబ్దములును, వ్యవహారోచితమైన భాషా శైలియు తరచుగా నగపడును. అతని సంస్కృతపదములలోకూడ భాష వ్యవహారమునకే సన్నిహిత మనిపించును.

అన్నమాచార్యునికవిత గేయకవిత. సరసము, కోమలము, సంగీతమయము, భావానుకూలమునైన భాషా శైలికే యిందు ప్రాధాన్యము. పదముల నా విధముగా మలచి అందించుటలో కూడ కవి నేర్పు స్పష్టపడుచుండును. వర్ణక్రమమును మార్చి ఉచ్చారణ సౌలభ్యముపై దృష్టి నిల్పుట, విసంధులు, విశ్లేష రూపములు, సానునాసికములు తరచువాడుట, వ్యాకరణ విరుద్ధమైనను వ్యవహారము నాదరించుట, జంటపదములు, జాతీయములు, నానుడులు, అనుప్రాసలు, అంత్యప్రాసలు ఎక్కువగాకూర్చుట, అనుకరణనాత్మకములు ననుకరణధ్వనులు గల శబ్దములు వాడి యౌచిత్యము నెరపుట అవసరోచితముగా తత్సమ బహుళమైన సమాసశైలి నుపయోగించుట, సందర్భమునకు మెరుగుపెట్టినట్లు సామెతలు వాడుట మున్నగునవి అన్నమాచార్యుని కవితలో విశిష్టముగా కనిపించు భాషాప్రయోగ పద్ధతులు. అతని రచన నేటికి 500 యేండ్లనాటి వ్యావహారిక భాషకు లిఖితరూపము. అది ఆనాటి జానపద గేయ శైలులెన్నిటికో స్థాయి నిచ్చిన సాహిత్యక రూపము. అతడు వాడిన శబ్దము లెన్నిటికో నేడు సరియైన అర్థము తెలియదు. అట్లే కొన్నిశబ్దములు మారురూపములతో లభించుచుండును. జాతీయములకు, నానుడులకు, సామెతలకు అతని రచన తరుగని గని. ఒక్కొక్కప్పుడొకే పదములో పది పదిహేను జాతీయములు గుదిగ్రుచ్చి యందించును. పల్లవిలో నున్న సామెతకు తోడు ప్రతిచరణములోను సజాతీయమైన సామెతలు పునరావృత్తి చేసి వాడుచుండును. అతని పలుకుబడులే కొన్ని యీ వెనుక సామెతలుగాను, జాతీయములుగానూ రూపొందినట్లు తోచును.

**పదకవిత**

పదకవిత పద్యకవితకంటె క్లిష్టము. ఇందే చరణమునకొక చరణము, ఏ పంక్తికా పంక్తి స్వయం సంపూర్ణమన్నట్లుండి అన్నియు పల్లవితో ననుసంధించుచుండును. పదమందలి భావమంతయు సూత్రప్రాయముగా పల్లవిలో నిమిడ్చి చరణములతో నదే భావమును వేర్వేరు విధముల విస్తరింపజేయవలెను. పల్లవికి గల యీ ప్రాధాన్య మెరిగిన అన్నమయ్య తన పదములలో వాటిని వజ్రపు

తునుకలవలె తీర్చిదిద్ది, సూక్తి వైచిత్రికి భావస్ఫూర్తికి మెరుగులు కూర్చినట్లొందించెను. అతని చరణములలోని పంక్తులు, అందలి పదవాక్యముల పొందిక యతిప్రాసములవలన విరుపులు, నిలుపులు మున్నగునవన్నియు మూసపోసి అందించినట్లు రూపసామ్యమంది నిగ్గులొల్కుచుండును.

అన్నమాచార్యుని పదములు నిబంధపదములు. అయిననూ వీనిలో ఛందో విధానముతో పాటు రాగ విధానము కూడ సమప్రాధాన్యము వహించినట్లు పద శీర్షమున నిల్పిన రాగ సంకేతముల వలన స్పష్టముగా తెలియును. అన్నమయ్య పరంపరాగతములైన మాత్రాచ్ఛందములు గ్రహించి రచనలో నెంతో వైవిధ్యము చూపెను. రగడ, మంజరి, ద్విపద, విషమసీసము. కళిక, ఉత్కళికవంటివెన్నో గేయోపయుక్తములైన ఛందములు విరివిగా ప్రయోగించెను. సంవాద గీతములు వ్రాసి నాటకీయ ఫణుతు లనుకరించెను. తన నాడు వాడుకలో నున్న జానపద గీతి శైలు లన్నిటిని యదేచ్ఛముగా స్వీకరించి లక్ష్యములు కూర్చెను. తొంబది కి పైగా రాగము లిమడ్చి రచన సాగించెను. సంకీర్తన లక్షణము వ్రాసి పదరచనా పద్ధతులకు శాస్త్రీయత నెలకొల్పెను. నేడు లిఖిత రూపమున దొరకుచున్న పదసాహిత్యములలో దక్షిణ దేశమంతకును అన్నమాచార్యుని పదములే ప్రాచీనములు. అతడక్షరాలా పదకవితా పితామహుడు.

**ముగింపు :**

అటు వైదిక కాలము నాటి ఆర్షవాక్కులతో ప్రారంభించి, యిటు ద్రావిడమున వెలసిన ఆళ్వారు భక్తుల సూక్తుల వరకుగల సమస్త ప్రాచీన సాంస్కృతిక మాన్యతలకు, సంప్రదాయములకు, సాహిత్యమునకు వారసత్వమంది కాలానురూపముగా వికసించి, సంగీతముతో మేళవించి విజృంభించిన పదసాహిత్య మన్నమాచార్య సాహిత్యము ఒక చేతిమీద నిర్మింపబడి పన్నెండు వేల కృతులకు పైగా నున్న పదసాహిత్యము తెలుగున కాక వేరొక భారతీయ భాషలో నేడు లభింపదు. తన రచనమంతయు రాగి రేకులపై వ్రాయించి భావి కాలము వారి కొరకు భద్రపరచిన ఉదాహరణము కూడ వేరొకటి లేదు.

గృహస్థాశ్రమమున నిల్చియే వైరాగ్య మలవరచుకొని, ఆచార్యుడై తానాచరించినదే యొరుల కుపదేశించి, పదకర్తయై తల్లక్షణకర్తగా పేరంది, ఆ జీవన మావేంకటేశ్వరుని అనన్యభక్తుడై తరించిన ధన్యజీవి అన్నమాచార్యుడు. అతని నాడే యిటు శ్రీరంగమునుండి, అటు సింహాచలము వరకు వినిపించిన యీ పద సాహిత్యము నేడు తిరిగి తిరుమల-తిరుపతి దేవస్థానము వారి సముచితోత్సాహదీక్షాయత్నముల వల్ల ఆంధ్రదేశమందంతటను ప్రతిధ్వనులిచ్చి, యిరుగుపొరుగు రాష్ట్రములలో కూడ వినిపించి ఆదరపాత్రమగుచుండుట ముదావహము.





తెలుగు ఎదలో తెలుగుతనం
తెలుగు [illegible] ారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అక్షయజ్యోతిగా వెలగాలని
[illegible] నిద్రలేచి
[illegible] మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషిచేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు - 3